# Tukharam

DEDICATED TO

M. R. Ry. Ch. L. NARAYANA PRASAD,

*Deputy Collector, Guntur*

BY

***Sreeram Veerabrahmam,***

*PANDIT,*

(*Formerly*) Noble College

(*At Present*) S. M. Training School,

**MASULIPATAM.**









*Author of*

*Chandrakanta, Japaneeyam, Vasantika (Inter Text)*

*Priyadarsika, Markandeyam, Paduka,*

*Pallava Raja Charitram, Vinodini,*

*Nana Rajanya Charitra, Etc., Etc., Etc.*

 **1924.** **[*PRICE RE. 1.***



131 Printed at the Vani Press, Bezwada.

# తుఖారామ్




ఇది
నోబిల్ కాలేజియందాంధ్రపండితులునుండి
ప్రస్తుతమున
షార్కి మెమోరియల్
ట్రెయినింగు స్కూలునందు
ప్రధానాంధ్రోపాధ్యాయులును ;
చంద్రకాంత, జపానీయ,
వాసంతిక, ప్రియదర్శిక, మార్కండేయ,
పాదుక, పల్లవరాజచరిత్ర,
వినోదిని, నానారాజన్యచరిత్రేత్యాది
గ్రంథకర్తలును నగు




**శ్రీ రామ్ వీరబ్రహ్మముగారిచే**

గుంటూరు మండలమున
హెడ్‌క్వార్టర్సు డిప్యూటి కలక్టరులగు
మ. రా. శ్రీ చిరుమామిళ్ల
లక్ష్మీనారాయణ ప్రసాద్, బి. ఏ. గారి
యంకితమున
రచింపఁబడి ప్రకటింపఁబడియె.


మచిలీపట్నము.
1924.
వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.


 [వెల రు 1—0—0






కృతిభర్త:

చిరుమామిళ్ల లక్ష్మీనారాయణ ప్రసాద్, బి. యే.,

డిప్యూటి కలెక్టరు, గుంటూరు.



కృతిభర్త:

చిరుమామిళ్ల లక్ష్మీనారాయణ ప్రసాద్, బి. యే.,

డిప్యూటి కలెక్టరు, గుంటూరు.

శ్రీరస్తు

# విజ్ఞప్తి.

---

చెన్నపురాంధ్ర సభవారేర్పఱచిన పోటీపరీక్షకై (Competition) నే నీగ్రంథమును దొలుత "శ్రీకృష్ణ దేవరాయల కొండ వీటి విజయ" మనుపేరఁ బ్రథమాశ్వాసము వఱకు మాత్రమె రచించి తత్సభవారిచే 1917 వ సం॥ న నొక పతక (Medal) మందియుంటిని. అయిన నప్పటినుండియు నీగ్రంథ ప్రకటనమున కవకాశము లభించినది కాదు. అంత మద్విరచితములైన మఱికొన్ని గ్రంథములను సాదర భావముతోఁ జిత్తగించి పీఠికలను వ్రాసి యొసంగుటయు గాక, 'వినోదినీ'నామక గ్రంథమును దమ యంకితమున బ్రకటింప ననుమతించిన గుంటూరు డిప్యూటీ కలెక్టరు గారగు శ్రీయుత చిరుమామిళ్ల లక్ష్మీనారాయణ ప్రసాద్ గారు పూర్వోక్త గ్రంథోదంతం బాలించి, యద్దానిని నిరంతర సత్కార్యాచరణ పరాయణియుఁ గీర్త్యర్థనైకాభిలాషిణియు నగు దమ మేనత్తగారి యంకితమున వెలయింపఁ జేయు గోర్కె గలదని నుడివిరి.

ఇంత వఱకేసాధ్వీమతల్లియుఁ గృతుల నందిన దెలియక వడదు. అయినను సప్తసంతానములలోఁ బ్రశస్తిగాంచిన కృతిసంతానంబు వడయ నభిలషించిన శ్రీ లక్ష్మీదేవమ్మగారేతత్కృతికన్యను దత్తపుత్రిగ స్వీకరించి కీర్తి గాంచఁ గరముఁ గౌతూహలాయత్తచిత్తలైన దెలిపించి యట్లొనర్పఁ గోరిరి.

కావునఁ దద్వంశ వర్ణనమును, ద్వితీయ తృతీయాశ్వాసములను రచించి, ప్రస్తుతమున నగుచున్న రక్తాక్షినామ సం॥ జ్యేష్ఠ బహుళ చతుర్థి భృగువాసరమున (1924 జూన్ 20) జరుగుచున్న లక్ష్మీదేవమ్మగారి పౌత్రియు, శ్రీయుత రాధాబాయమ్మగారి పుత్రియు నగు చిరంజీవి సౌభాగ్యవతియైన యనసూయాబాయమ్మగారి వివాహమహోత్సవసందర్భమున శ్రీ లక్ష్మీనారాయణ ప్రసాద్, బి. ఏ. గారి పరిపూర్ణానుగ్రహముచే ముద్రించి, యీ నూత్నదంపతుల కఖిలాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియుఁ బుత్రపౌత్రవంశపరంపరాభివృద్ధియు, నాపరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాతమని కోరుచు బ్రకటించితిని.

ఇందలి యితివృత్తము:- శ్రీకృష్ణ దేవరాయులు పూర్వదిగ్విజయ మొనరించి, గజపతిపుత్రియైన తుఖారామును బరిణయమై దాసీపుత్రుడను గారణమున తన్ను వధింప గురుజనబోధితయగు దాసీప్రోద్బలముచే నాయుధధారిణియై ప్రథమసమావేశసమయమున శయనాగారంబు ప్రవేశించి యున్న యవసరమున శ్రీకృష్ణరాయం డాయుదంతంబు దెలిసికొని యాపె నిలువెడల నంపుటయు, నంతఁ తుఖారామ్ పశ్చాత్తప్తచిత్తయై మార్గమధ్యమున నె నిలిచి పెక్కు సత్కార్యము లాచరించి తుదకు భర్తృకృపావీక్షణంబులకుఁ బాత్రయై మగిడి రాజధానింజేరి, యష్టైశ్వర్యంబులతోఁ దులదూఁగుచు నానందాబ్ధి నోలలాడి మించిన కథను దెలుపును.

ఇట్లు
గ్రంథకర్త.

---




శ్రీరస్తు

శ్రీ శ్యామలాంబాయైనమః

# తుఖారామ్.

## అవతారిక

శా॥ శ్రీమన్నీలపయోదమధ్యమున వా•సిన్ బేర్చువిద్యుల్లతా
స్తోమం బీయెడఁ బార్శ్వభాగములఁ బొ•ల్పొం జిత్రమం చెన్నఁగాఁ
బ్రేమంపుం బణతుల్ నిజాంకములపై • వేడ్కన్ వసింపంగ స
త్క్షేమం బిచ్చు ఖగేంద్రవాహనుఁడు ల•క్ష్మీదేవినిన్ బ్రోవుతన్.

మ. తతవక్షోరుహమధ్యభాగవిలస•ద్రత్నప్రభాపూరహా
రతతిన్ భాసిలుస్వీయనాథుని స్ఫుర•ద్రమ్యాకృతిన్ భూరిసం
తతలజ్జాభరకైతవంబునను మూ•ర్ధం బల్లనన్ వంచి మో
హితయై కాంచుచు సంతసిల్లుసిరి మా•యింటన్ విరాజిల్లుతన్.

సీ॥ వెండిబంగారుల•కొండ లుండియు నీకు
శేషులే చెలువంపు•భూష లయ్యె
ధనదుఁ డంతటివాఁడు • దగుమిత్రుఁడై యుండఁ
దిరిపెంబు నెత్తుచుఁ • దిరుగ నయ్యె
సర్వజ్ఞబిరుదయ•శస్కలితుఁడ వయ్యు
స్థాణుండ వను పేరఁ • దనర నయ్యె
కైలాసదివ్యదు•ర్గంబు లుండియును శ్మ
శాన భూములు నివా•సంబు లయ్యె

తే॥ నీ విలాసంబు దలపనో • దేవదేవ
తరమె యంచు వర్ణించు స•ద్భక్తవరులఁ
గాంచి రక్షించు నా యుమా•కాంతుఁ డెపుడుఁ
బ్రోచుఁగాక లక్ష్మీదేవిఁ • బూర్ణకరుణ.

చ॥ పరుఁ డని భూతనాథు డని • భైక్షకవృత్తిఁ దగన్ భుజంగ శే
ఖరుఁడని రుద్రమూర్తియని • కాంచ దిగంబరభూతిమాత్రబం
ధురుఁడని యేవగింపక మ•నోహరు నర్ధశరీర మూని, దు
ర్భరతరనిష్ఠఁ గొల్చెడి శి•వంకరి ప్రోవుత మిమ్ము నెప్పుడున్,

మ॥ చతురాస్యుండను పేరు గాంచితివి య•స్మత్సత్కళావైభవో
న్నతిగా దే యను వాణిపల్కులకు నా•నందించియానాఁ ద్వదా
కృతి మెచ్చన్ దనుమీఱి ముద్దులిడ నే•నిట్లొందితిన్ బ్రీతినీ
చతురాస్యత్వమటంచుఁ బల్క నజుఁ డై•శ్వర్యాయువుల్ మీకిడున్.

మ॥ వనితల్ బిడ్డలగందురంద్రుగద నీ • పట్లన్ గడున్ జిత్రమై
యొనరెన్ గాంచనగర్భ! నీవదన బా•హూర్వంఘ్రులన్ బిడ్డలన్
గనుటంజూడఁగ నీవు పూరుషుడవో • కాంతావతంసంబవో
యనుచున్ నవ్వెడిశారదాంబ దమజి•హ్వన్ నిచ్చలున్ నిల్పుతన్.

సీ॥ రత్నప్రభాపూర • రమ్యవల్లకితోడఁ
జారుచంద్రావతం•సంబుతోడ
లలితవాగ్విభవలీ•లాశుకసఖితోడఁ
గమలేక్షుపాశాంకు•శములతోడ
మరకతశ్యామల • మంజుగాత్రముతోడ
జగదావనచతుర్భు•జములతోడ
గానకళామహా • కౌశలత్వముతోడఁ
గమనీయసత్కటా•క్షములతోడఁ

తే॥ గీ॥ బరగియమృతాబ్ధిమధ్య వి•భాసమాన
నవమణిద్వీపబిల్వవ•నస్థకల్ప
కావృతకదంబవిపినవి•హారలీల
నొప్పు శ్యామలాంబపదాబ్జ • యుగళిఁ గొలుతు. 7.

సీ॥ తతరత్నమయహేమ•పతక మిప్పించితి
వి భుజంగరాణ్మహా•ప్రభుని చేత
నూటపదాఱుల • నేఁటేట నిప్పించు
దువు మందసావనీ•ధవుని చేత
ఏనూఱు లోకసారి • గానె యిప్పించితి
వేంకటగిరిమహీ•విభుని చేత
వేయిరూప్యముల సం•ప్రీతి నిప్పించితి
వల నూజివీటి భూ•పాలి చేత

తే॥ గీ॥ తక్కుఁగల నృపాళి వలనఁ • బెక్కులైన
గౌరవములఁ గావింపించి • తౌర! యేమి
చేసెదో యీ కలెక్టరు • చెంత నేఁడు
అమలగుణకదంబ! • మదంబ! శ్యామలాంబ! 8.

మ॥ సతతోరస్థలగండభాగసమద•స్రావంబు వర్షంబుగా
సితదంతచ్ఛవి మించు మించులుగ వి•స్తీర్ణోరు కర్ణద్వయా
గతవాతం బనిలంబుగాఁ బొలచి భ•క్తశ్రేణి కామ్యార్థసం
తతి వర్షించు గజాస్యమేఘము నవి•ఘ్న ప్రాప్తికై కొల్చెదన్. 9

క॥ భీకరజలచరయుతర
త్నాకరమున గలుగు మణుల • హర్షముతోడన్
జేకొనుగతి మత్కృతి గుణ
మే కైకొనుఁడనుచు సత్క•వీశులఁ దలఁతున్

చ॥ నడక హుళారంగులేక పద • నక్రమతఁబూనఁగఁబోక శయ్యసొం
పెడపఁగనీ కలంకృతి వహింపక యెప్డు పరార్థవాంఛ లో
నిడి తమయంతరంబు గణియింపని జారిణి యే కవిత్వముదం
బడరఁగ మెత్తురే విబుధు • లా సరసజ్ఞులు వేయునేటికిన్.

వ॥ ఇట్లిష్టదేవతా వందనాదుల నొనర్చియున్న యవసరమున

సీ॥ ఏ ధన్యు బహుళశక్త్యీశ్వరత్వము రాజ
వంశోచితప్రభావంబు దెలుపు
ఏ పుణ్యతముని ప్రజాపాలనోద్యోగ
మతులితసద్గుణోన్నతిని దెలుపు
ఏ కృపాకరు నసదృశయశఃకామిని
నిరుపమానైశ్వర్యగరిమఁ దెలుపు
ఏ మహోదారుని • హృదయైక సంకల్ప
మాప్తసచ్ఛ్రేయస్సహానము దెలుపు

తే॥ గీ॥ క్రమకులభూషణుఁడయి • క్రాలునెవఁడు
అట్టి చిరు మామిళాన్వవా • యాబ్ధివిధుఁడు
నతగుణుండు శ్రీ నారాయ • ణ ప్రసాదుఁ
డనఘచరితుఁడు సుజనుండు • దనరుచుండు. 13

సీ॥ తగు రీతిఁ బొన్నూరు • స్థలపురాణమును గా
శీ కృష్ణమాచార్యు చేత వేడ్క
యాంధ్రీకరింపించి • యద్దాని వెలయింపఁ
బ్రోత్సాహమొసఁగెనే • పుణ్యతముఁడు
విస్ఫురత్ఫణితి మద్విరచితంబైన వి
నోదినీ నాటక • మాదరమున

శ్చింతను సద్గతిం గలుగఁ • జేయు నటంచు మనీషు లిట్టి స
త్సంతతి స్వీకరి చుట య•శంబు బరంబు గడించుటే గదా

క॥ కృతిమహిమంబును దెలియు సు
కృతులు సదా కృతులఁ గొనుచు • గీర్తిం గనరే
కృతియొక్కఁడె సంతానవి
తతి భాసిలు నాశశాంక•తారార్క మిలన్॥

సీ॥ గండిదెగుటనో స•కాలానుగుణ్యావ
ర్షప్రాప్తిలేమి నో • సరసులింకు
చోరనిరంకుశ•క్షోణీశదుష్ప్రయ
త్నములచే ధననిధుల్ • నాశమగును
భూరినిదాఘాత•పోరు తీక్ష్ణతచేత
వరభూరుహోపేత•వనము లెండు
ఉర్వీ నపాత్రున • కొనరింపఁబడిన బ్ర
హ్మస్థాపనం బెన్న • వ్యర్థమగును

తే॥ గీ॥ ఉరుతరానిలోద్ధతి గుడుల్ • విరిసికూలు
కొడుకు దుశ్శీలుఁ డైనచో • గోడు గూర్చు
గాన నాచంద్రతారభా•స్కరము వెలుగు
సత్కృతియె వతంసము సప్త • సంతతులను॥ 20

క॥ కావున నొకకృతిఁ గైకొనఁ
గా వేడుక వుట్టె సుగుణ•ఖనియా లక్ష్మీ
దేవమ్మగారి కీ యెడ
గావున సద్గ్రంథ మొండు • గావింపుమయా॥ 21

మ॥ అనుచున్ మాటపదార్లతో నపుడు మీ•డ్యంబిచ్చి సమ్మోదసం
జనితోత్కీర్తి వచియించెనో సుకవి • యా•చంద్రార్కతారంబుగా

...ప్రవృత్తి • డె కన్నాఁడు॥ 14

సీ॥ శ్రీవిశ్వకర్మము•ఖావిర్భవకులాంబు
రాశిచంద్రుండు ని•ర్మలయశుండు
ప్రథితనాముండు శ్రీ•రామన్నవాయజుం
డనుపమ నిత్యస•త్యవ్రతుండు
అంగిరసాఖ్యవి•ఖ్యాతగోత్రపవిత్రుఁ
డాయతవేద పా•రాయణుండు
నగు గంగయాచార్య • నవరజాతుండును
సుబ్బమాంబా గర్భ • శుక్తిముక్త

గీ॥ కంబునైన వీరబ్రహ్మ • కవిని వినుత
వేంకటశివాఖ్య కైలాస • విబుధవరుల
ననుజుఁడ నగు నను గాంచి • హర్షమలరఁ
బలికెఁ గరుణాతరంగిత • స్వాంతుఁడగుచు॥ 15

సీ॥ రచియించితివి శ్రీ వి•రాట్ప్రభుశతకంబు
సాంద్రరసాక్రాంత • చంద్రకాంత
ఆడించితివి నాట్య • మల్ల జపానీయ
మను చరిత్రాత్మక • మైన గాథ
బైరి డాపు లేమమూర్ • భవ్యమా కథగాని
వాసంతికాభిఖ్య • వ్రాసితివిగ

ఘనభూదాన మొసంగి మీకు ముదముం గావింపగా నుంటిమిం
కను గానర్ రచియించి తెమ్మ యొక సద్గ్రంథంబు వే వేగమే

చ॥ అన విని భూరిహర్షపుల•కాంకిత దేహుఁడ నై కవీశ్వరుల్
ఘనమతులైనవారు సము•ఖంబున నుండగఁ నెందఱో నన్నుఁ
గని యిట గౌరవించెనని•కౌతుకమంది తదన్వయక్రమం
బును రచియింతు భవ్యరస•పూరిత వాగ్విభవంబు మీరగన్

సీ॥ అఖిల లోకాంతర•వ్యాపకుం డగుట స
హస్రశీర్షుం డన • నలరె నెవఁడు
నిఖిలచరాచరా•నీకపోషకుఁ డౌట
విశ్వశంభువుఁ డన • వెలసె నెవఁడు
సకలకార్యాకార్యా•సద్విచక్షణుఁ డౌట
విశ్వాత్ముఁ డను పేర • వెలిగె నెవఁడు
బ్రహ్మవిష్ణు మహేశ్వా•రమహేంద్రనాముఁ డై
పరమస్వరాట్టనఁ • బరగె నెవఁడు,

తే॥ గీ॥ అట్టి శ్రీవిరాట్పురుషక•ల్పవనీజ
బాహుశాఖోరుఫల మనఁ • బ్రబలి కీర్తి
శౌరవీరప్రతాపవి•స్తారపటిమ
వరలు చుండెను క్షత్రియా•న్వయము కరము॥ 24

తే॥ గీ॥ అట్టి



నవలావిధంబున • నవలాలితపదాళిఁ
దగరచించితి ప్రియ•దర్శిక యన
హృద్యమై మృదుపద్య • గద్యాత్మకముగ మా
ర్కండేయచరితంబు • వ్రాసియుంటి
మేటివినోదిని • నాటకంబును గూర్చి
యలరించితివి యస్మ • దంకితముగ
వ్రాసితి శ్రీరామ • పాదుకా పట్టాభి
షేకాఖ్యహరికథ • చెలువమలర
దేశచరిత్రమై • దీపించు రాజన్య
చరితంబు సమకూర్పఁ • జాలితివిగ

తే॥ గీ॥ మేటికృష్ణరాయల కొండ • వీటి విజయ
మును మృదూక్తులచేఁ బద్య•ములుగఁ గూర్చి
చెన్నపుర్యాంధ్రసభవారి • చేతఁ బతక
మంది యుంటి శ్రీరామన్వ•యాబ్ధిచంద్ర॥ 16

శా॥ వీరబ్రహ్మకవీంద్ర! వ్రాసితిగదా•విన్నాణ మొప్పంగ నా
నా రాజన్యచరిత్ర మాది గల • గ్రంథశ్రేణి యవ్వాని వి
స్తారానందముతోడఁ గాంచుటను స•ద్గ్రంథంబొకండింక మీ
చే రమ్యాకృతిగూర్పఁజేయ మదిహా•ర్షించెన్ గడు న్వొండియున్

ఉ॥ ఎందఱు భూపతు ల్ధనికు • లెందఱు ధాత్రిని బుట్టి యేఁగి రా
యందఱియూరు బేరుఁ దెలియం•బడుచున్నదె! సత్కవీంద్రు లా
నందముతోడ సత్కృతికి • నాథులఁ జేసిన వారిపేరు గా
కెందున గానఁ బేరు వెల•యించుట కొక్కకృతిన్ గొనందగున్

ఉ॥ అంతియెగాదు ధర్మముల • కన్నిట నుత్తమమైనదాట గా
కెంతటి పాపు నైనఁ దన • యేడుదరంబుల వారితోడ ని

ప్రతిహతబాహుగర్వమున • రాజవరేణ్యుల నెల్లరన్ సమ
స్కృతులొనరింపు మంచటులఁ • జేయనివాఁని శిక్ష చేయుచున్

క॥ కారాగృహముల నుంచుచుఁ
గారుణ్యము డించి యవని • కాంతుల నెంతే
క్రూరత్వంబున నపు డా
ధారుణిపతి హింస సేయఁ • దలకొని యుంటన్

క॥ అతని దాడికి నోడియు
క్ష్మాతలపతు లీ యమాను•షము సైపకయున్
కాతరచేతస్కుల రై
యాతఱి వేషాంతరంబు • లర్హము లనుచున్ 28

సీ॥ యజ్ఞోపవీతముల్ • ద్యజించి స్నానసం
ధ్యాద్యనుష్ఠానంబు • లడచి పుచ్చి
నిత్యహోమాదిక•ర్మత్యాజ్యులై సదా
తగ శూద్రవేషావ•తారు లగుచు
కొందరు వర్మసం•జ్ఞం దనరారిన
వెలమశబ్దము బూని • మెలఁగి రొకట
మఱికొంద ఱటులె క్ర•మంకరాష్ట్రముఁ జేరి
కమ్మవా రన నటఁ • గడపి రటులె
తే॥ గీ॥ దలఁప రాట్ఛబ్దభవ మయి • వెలయు రెడ్డి
నామమునఁ గొంద ఱొదిగి యుం•డంగ వచ్చె
పాండవులు మున్ను విరటుభూ•పాలుమ్రోల
భిన్నవేష వృత్తుల నున్న • విధము బోలె 29

వ॥ అట్టి క్రమవంశంబున— 30

మ॥ చిరుమామిళ్లకులాబ్ధిచంద్రుఁడుయశ•శ్శ్రీసాంద్రుఁడవ్యాజస
త్కరుణోదారుఁడుసద్గుణుం డతులవి•ద్యాలోలుఁ డశ్రాంత మా
సరసీజాక్షపదారవిందభజనో•త్సాహాఢ్యుఁడున్   సత్యవా
క్నిరతాత్ముండును నైన వేంకటపతిన్•గీర్తింపగాఁ జెల్లదే॥ 31

క॥ ఆ వేంకటపతితనయుం
డై విశ్రుతిఁ గాంచె దశది•శావృతకీర్తి
శ్రీవిలసితుఁ డగు జగ్గన
ధీవరనుతచరితుడును సు•ధీమణి యగుచున్.

క॥ ఈ జగ్గన్నాహ్వయుఁ డ
వ్యాజకృపాకలితు బుధజ•నార్చితచరితున్
తేజోనిధిని యశోవి
భ్రాజితుఁ బట్టాభిరాముఁ • బడసెన్ బ్రీతిన్. 33

సీ॥ మానవావళికి దై•వానుగ్రహము లేక
సాథ్యంబు గా కుండు • సంతతి యన
బహుళాన్నదానముల్ • వ్రతశతంబులు సల్పి
పడిసిన తొలి నోము•పంట యనఁగ
ఉరుతరపున్నామ•నరకాబ్ధి దాటింప
శ్రీకరం బగు భూరి • నౌక యనఁగ
జగతి నాతారార్క•చంద్రంబుఁ దమ పేరు
ప్రకటించు వంశాంకు•రం బనంగ
తే॥ గీ॥ నలరు బుత్రు భవ్యచరిత్రు • కులపవిత్రు
మంగళాకారు మేరుస•మానధీరుఁ
బడసె లక్ష్మీపతి యనంగఁ • బరగు వాని
రమ్యతరకీర్తి, పట్టాభి•రామమూర్తి॥ 34

క॥ ఈ లక్ష్మీపతి సతతద
యాళున్ నయశీలు కవిజ•నావనలోలున్
పాలిత సద్గుణజాలున్
శ్రీలలితున్ వేంకయాఖ్యు బ్రీతింగాంచెన్॥ 35

ఉ॥ భూరిగుణాకరుండు బుధ•పూజితసచ్చరితుండు మేరుగం
భీరుఁడు దానకర్ణుఁ డల•వేంకయ పుత్రుల గాంచె నిర్వురన్
వారలఁ దాతపేరటను•వాసి వహించినవాని వెండియున్
సూరయనామధేయుఁ బరి•శుద్ధయశోదయు సూరిగేయునిన్॥

ఉ॥ హలుణకళాధురంధరత•నొప్పకయే తహశీలుదారుఁ డై
రాణ వహించి మించి దివి•రమ్యతరోరు యశంబు నింపి క
ళ్యాణగుణాకరుండు విభు•దార్చితశీలుఁడు సంతతాశ్రిత
త్రాణపరాయణుండు సువ•దాన్యుఁడు సూరయనాముఁ డెంతయున్॥

మ॥ తహశీల్దార్పదవిన్ వహించియణుమా•త్రంబేనిగర్వంబు లే
కహాహానిచ్చలుసావధానపరుఁడై•యాలించు విజ్ఞప్తు లీ
మహనీయుండొరు లేరుబోల్తురుప్రశం•సన్ జేయఁగా వీని కి
మ్మహియంచున్ నుతియింత్రు సూరయఘనున్•మానోర్యరుచారిత్రునిన్

క॥ శ్రీనారాయణు సత్కృప
చే నీ సూరయ్య గాంచె•శ్రీరాములు ల
క్ష్మీనాథుఁ డను కుమారుల
మానితగుణధనుల సుతల•మఱి యైదుగురన్॥ 39

క॥ రామాజనకాముఁడు శ్రీ
రామాఖ్యుఁడు సద్గుణాభి•రాముఁడు కీర్తి
స్తోముఁడు వైభవజితసు
త్రాముఁడు సూరయ్యజ్యేష్ఠ•తనయుం డలరున్॥ 40

ఆ॥ వె॥ ఏకకాలమందె • యేకమాతాజని
తాంగనామణుల శు•భాంగయుతల
మేటిగుణచరితల • మీనాక్షి వేంకమ్మ
యనెడి సతులఁ బెండ్లి • యాడె నితఁడు॥ 41

మ॥ ఖగరాడ్వాహను నంక పీఠముల సౌ•ఖ్యంబొప్ప నొప్పారుచున్
మొగులంబొల్చు మెఱుంగుల ట్లలరు శ్రీ•భూనీళలంబోలెఁ జె
న్నుగమీనాక్షియు వేంకమాంబయును బ•త్నుల్గా దనుం జేరి కా
ల్వఁగ శ్రీరామమహాశయుం డనుపమై•శ్వర్యంబులన్ మించెడిన్॥

సీ॥ నీ మెచ్చులాడిని • నెత్తిపై నిడికొని
దే నిట్లు కడు కృశి•యించు నట్లు
అర్థాంగిఁ జేసితి • వది నీకు న్యాయమా
యని యొక్క యింతి పే•రలుకఁ బూను
నీ ముద్దులాడి పూ•నినయల్కఁ దీర్ప నీ
కౌను దానికి మ్రొక్కఁ • గాని నన్ను
కటకటా తత్పదా•క్రాంత జేసెదు నీకు
నుచితమే యనుచు వే•ఱొకతె యలుగు

తే॥ గీ॥ ఇటు గృహచ్ఛిద్రములచే ని•జేశు బిచ్చ
గానిగాఁ జేసి పంపు గం•గాభవాను
లటులఁ గాక శ్రీరాము న•ర్థాంగలక్ష్మ
లనిశ మన్యోన్యమైత్రిమై • నలరు చంద్రు

మ॥ ఒక పుష్పంబునకై పరస్పరము నీ•ర్ష్యోద్రేకహృత్పద్మలై
యకటా సంగరభూమి కంపి రట స•త్యారుక్మిణుల్ ప్రాణనా
యకు నంచున్ హసియించుచున్ మగుల మీ•నాక్షీ సతీవేంకమాం
బిక లాత్మేశు భజింత్రు వీడ కెప్డున్ • ప్రీతిన్ మహాభక్తితోన్॥

సీ॥ పడసె మీనాక్షమ్మ • భవ్యోరుకీర్తిచే
సుప్రసిద్ధుఁడగు భా•నుప్రసాదు
సూరయ్య వెంకయ్య • సుగుణుఁ గోదండరా
మయ్య వేంకటపతి • కాత్మజులుగ
వేంకమాంబిక గాంచె • వినుత శీలుర నల్వు
రను వారిలో బుచ్చి • రాఘవయ్య
లలితకీర్తియుతుండు • లక్ష్మీనృసింహుండు
వరదరాజాఖ్యుండు • వరగుణుండు
తే॥ గీ॥ ననెడి వార లగ్రజు లయి • తనరుచుండ
దశదిశావృతకీర్తివి • స్తారుఁ డగుచు
గర్తపురపాలనోద్యోగ•గరిమ బూని
తనరు నాలవతనయుం డు•దారగుణుఁడు 45

క॥ ధీరుం డీయన జలధి గ
భీరుఁడు సుప్రథితగుణప•విత్రుఁడు లక్ష్మీ
నారాయణప్రసాదుఁడు
సూరిజనస్తోత్రకీర్తి • శోభితుఁ డలరున్ 46

సీ॥ పద్మాలయాసతీ•ప్రాణేశ్వరునకు నె
వ్వనిహృదబ్జంబు ని•వాసగృహము
మందారకుందార•విందచందనరుచి
గీర్తింప నెవ్వాని • కీర్తిసమము
బలికర్ణమేఘము•ఖ్యులదానవిభవ మే
వాని యౌదార్యోప•మానపదము
నలహరిశ్చంద్రా • రాములకథ లెవ్వాని
మేటిశీలమునకు • మేలుపట్టు

తే॥ గీ॥ లట్టి శ్రీహరిసద్భక్తుఁ • డమలయశుఁడు
నిరుపమవదాన్యుఁ డభివంద్య • చరితుఁడు చిరు
మామిళాన్వయక్షీ రాబ్ధి•సోము డనఁగ 47
నడరు నారాయణప్రసా•దుఁడు ధరిత్రి॥

ఆ॥ వే॥ అలఘుఁడితఁడు మండ • లాధికారుల ప్రోల
గౌరవార్హుఁ డగుచు • గర్తపురిని
అమలచరితుఁ డగుట • నాంతరంగిక కార్య 48
దర్శిపదవి నొంది • తనరె నిగుల.

ఉ॥ తాతనుబోలె నీయనయుఁ • దద్దయుహబాణకశాప్రపూర్ణతన్
పూతచరిత్రుఁడై చుమును • మున్నరపిన్ దహాశీలుదారుఁడై
ఖ్యాతి గడించి గర్తపురి • గ్రక్కున డిప్టికలెక్టరై బుధ 49
వ్రాతము మెచ్చనశిష్టజన • పాల ముంబొనరించు నేఁటికిన్.

శా॥ శ్రీనారాయణపాదపంకజయుగ • శ్రీచింతనాసక్తిఁ ద
ద్ధ్యానంబున్ విడనాడ కెప్పుడు విశా • లాక్షీసతిన్ బత్నిగా
నానందంబున స్వీకరించి కరుణా • యత్తైకచిత్తుండు ల
క్ష్మీశ్రీనారాయణసుప్రసాదుఁ డలరున్ • క్షేమంకరాకారుఁడై.

తే॥ గీ॥ వినుత శాయపనాయని • విమలవంశ
మండనుఁడగు శేషాచల • మల్లిఖార్జు
నప్రసాదుని తనయ సు • జ్ఞాననిలయ 51
యగు విశాలాక్షి సుగుణంబు • లగణితములు.

సీ॥ తలవాకిటను నిల్పి • తలఁగ ద్రోకప్పుడు
పలువురనోళ్లలోఁ • బడియె నొకతె
గురులఘుత్వంబుల • నరయక చంచల
శీల యై యందందుఁ • జెలఁగు నొకతె

పుట్టి నింటికి సొద • వెట్టి మెట్టినయింటి
కినిగాక వెలియయి • చనియె నొకతె
పెనురాగమై వలఁ • చినవానినె త్రిప్పి
కెక్కి కూర్చుండిన • యింతి యొకతె
తే॥ గీ॥ అనుచు వారాశిరశనానగ • జాభ్రగంగ
లను దిరస్కృతి సేయు వ • ర్తనము గలిగి
తేజరిలు విశాలాక్షీస • తీమతల్లి
కలితగుణవల్లి సకలార్థ • కల్పవల్లి॥ 52
తే॥ గీ॥ ఇటుల శ్రీరామఘనుఁ డింతు • లిర్వుర దు
సుగుణధనులను బెక్కండ్రు • సుతుల గాంచె
నింక వీనిసోదరి మత్కృ • తీశ్వరి యయి
యలరుచుండు లక్ష్మీదేవి • యధికశీవి॥ 53
శా॥ శ్రీదామోదరుపాదపంకజరజః • శ్రీమాళిఁ గీలించి ల
క్ష్మీదేవాంబిక భక్తిపూర్వకముగాఁ • సేవించు దద్దేవు స
మ్మోదంబొప్ప ననేకధర్మముల సం • ల్పూర్ణనిచ్ఛలీయమ్మతో
నౌదార్యంబునఁ బోల్పఁజెల్లు సతులెవ్వా • రా యీధాత్రీస్థలిన్
ఉ॥ ఆర్తజనావనాభిరతి • నాశ్రితవర్గము నాదరింపుచున్
గర్తపురీవరంబున ఘ • నం బగు సత్ర మొకండు నిల్పి స
త్కీర్తిగడించె నండ్రు యువ • తీజనవర్గము నందు శ్రీరమా
భర్తపదాబ్జసేవ నెడఁ • బాయని యీవనితామణిన్ గడున్
సీ॥ అతిథిసంతతికి మృ • ష్టాన్నభోజన మిడు
నధ్వగావళికి స • త్రాన్న మొసఁగు
బీదసాదలఁ గడు • నాదరించును శర
ణాగతులకు నభ • యం బొసంగు

సత్యశీలములు భూ•షణములు గా నెంచు
నాశ్రితులను సుతు • లట్లఁ బ్రోచు
మనవుల నెపుడు స•మ్మతి మెయి జెల్లించు
కవిపండితశ్రేణి • గౌరవించు
తే॥ గీ॥ అమలతరకీర్తి కెంతయు • వ్యయ మొనర్చు
ననుచు బుధులు గీర్తింప స•ద్యశముఁగాంచి
సమధికైశ్వర్యమున మించి • సంతసంబు
నలరుచుండె లక్ష్మిదేవి • యతులకీర్తి॥ 56

క॥ పుట్టిన యింటికి మఱి తా
మెట్టిన యింటికిని ల సద•మేయ యశశ్శ్రీ
యుట్టిపడ సత్కృతులఁ జే
పట్టు నిఁకన్ మెట్టి నింటి • వంశము వినుఁడీ.
సీ॥ శాఖమూరు కులాంభోధి•శశి యగు రఘు
నాయకులు గాంచె బుచ్చయ్య • నాయడమ్మ
అరయ సుబ్బన్న వెంకన్న • యనెడి తనయ
చయము నా చక్రి భుజచతు•ష్టయముఁ బోలె॥ 58

చ॥ శుభమతి నాయడమ్మ తన•సోదరు సుబ్బన పుత్రులందు స
ద్విభవ మెలర్ప దత్తునిగ•వెంకయఁ గైకొని మించె వీని కా
త్మభవులు వేంకటాద్రియు, సు•దారుఁడు బుచ్చయ గల్గి రైన నీ
యుభయులుఁ బుత్రహీనులయి•యుర్విని బాసిరి దైవికంబునన్
చ॥ తనమదిఁ గొంత కుంది వసు•ధాస్థలి వెంకయ స్వీశవంశమున్
దనరఁగఁ జేయగోరి తన•దమ్ముఁడు చెల్లయ యైనవాని పౌ
త్రునిగుణధీరునిన్ గలుష•దూరుని యోగ్యుని వేంకటాద్రిపు
త్రుని గొనె వెంకటప్పయను • దోరపు వేడుకతోడ దత్తుఁగా.

సీ॥ తన ముఖపద్మంబు • తరుణీకటాక్షవీ
క్షణబంభరములను • సరసఁ జేర్ప
తన దానరవిరశ్మి • ఘనపండితార్యదా
రిద్ర్యాంధకారంబు • ప్రీలఁ జేయ
తన ప్రతాపాగ్ని శా•త్రవబృందకాననో
త్కర మశేషంబుగఁ•గాల్చి వైవ
తన కీర్తినర్తకి • దశదిశావృతమహీ
రంగస్థలమున న•ర్తనము సలుప.
తే॥ గీ॥ శాకమూరుకులాంభోధి•చంద్రుడగుచు
సత్యవాగ్గతి నల హరి•శ్చంద్రుఁ డగుచు
పృథులతర వైభవమున దే•వేంద్రుఁ డగుచు
నౌర శ్రీవేంకటప్పయా•హ్వాయుఁడు దనరె॥ 61
శా॥ ఔదార్యంబున వేంకటప్పయకు నీ•డౌవార లేరీ యనం
గాఁ దా ఖ్యాతి గడించి మించి మిగులన్ • కౌతుహలం బొప్ప ల
క్ష్మీదేవీసతిఁ జెట్టబట్టి సిరులం • జెన్నొంది నిత్యాన్నదా
నాదుల్ సల్పుచు నిర్వహించెఁ దన గా•ర్హస్థ్యంబు స్తుత్యంబుగా॥
క॥ ఈయుభయులకును రాధా
బాయమ్మ యనూన సుగుణ•వతియాగర్భ
శ్రీయుత యతులిత సద్వ్రత
ధీయుత కవిలోకనుత ప•తివ్రత గలిగెన్॥ 63
చ॥ బుధనుతపుణ్యశీలమును • బూని జనించె సతీవతంస మీ
మిథునలతాప్రసూన మయి • మేటియశస్సురభిప్రపూర్ణమై
పృథులతరానురాగసము పేత•వశీకృత నాథభృంగ మై
మధితసువర్ణసద్రుచి స•మంబయి కోవిదపూజనీయ మై॥

తే॥ గీ॥ ఇటులజనియించి నట్టి యా • యేకపుత్రి
నిడిరి భానుప్రసాదున • కీయన దన
సోదరాత్మజయగు నన•సూయను గడుఁ
బ్రేమమునఁ దనకడఁ జేర్చి • పెంచుచుండె॥ 65

సీ॥ శారదశర్వరీ•సమయభాసితనిశా
పతిదీప్తచంద్రికా•పటల మనఁగ
పాథోనిధిమథితా•వసరసముద్భూత
భూరిపీయూషడిం•డీర మనఁగ
తతవజ్రవేదికా•స్థితభారతీహస్త
మండితస్ఫటికాక్ష•మాల యనఁగ
హరమౌళిసంవాసి•తాభ్రగంగావగా
హనవిలాసోల్లస•ద్ధంసి యనఁగ,

తే॥ గీ॥ నడరి నిజయశం బాశల • నధిగమింప
లలితవితరణ గుణగణా•లంకృతుండు
సుప్రథితవర్తనుండు భా•నుప్రసాదుఁ
డలరు నద్వితీయ చరిత్రుఁ • డగుచు మించి॥ 66

మ॥ కరముల్ బుత్రిఁయు బౌత్రియుల్ సతతముల్ • గౌతూహలంబొప్పఁగా
సిరులం జెన్నలరారుచుంటఁ గని ల•క్ష్మీదేవి చిత్తంబులోఁ
బరమానందముఁ జెందుచున్ స్థిరతరై•శ్వర్యాయురారోగ్యముల్
ధరణిన్ గల్గ నొనర్చుచుండు నఁట సం•సత్కార్యంబు లవ్వారిగాన్॥

సీ॥ మల్లికామంజరీ•మలయు గంధం బట్లు
పన్నీట శైత్యంబు • ప్రబలు నట్లు
చంద్రోదయమున శ•శ్వజ్జ్యోత్స్న గల యట్లు
పంచదారను దీపి • మించునట్లు

మేల్కడానిని వన్నె • మిళితమై నట్టులు
హీరాళి దీధితు • లెసఁగునట్లు
చింతామణిని దాన•శీల ముండినయట్లు
వనధి రత్నంబులు • పరగు నట్లు
తే॥ గీ॥ సహజగుణశీలవదాన్య•సచ్చరితము
లలర నిరతంబు పుణ్యవ్ర•తాఢ్య యగుచు
విమల హరికథా శ్రవణలో•లాత్మ యగుచు
నవనిఁ దనరారు వేంకట•ప్పయ్యగృహిణి॥
శా॥ తా నాత్మీయ కుమారికామణిని రా•ధాబాయిఁ గన్నట్టులే
యానందం బెసఁగన్ మదీయకృతి క•న్యన్ గాంచఁ జేపట్టి ల
క్ష్మీనారాయణ సుప్రసాదునకు ల•క్ష్మీదేవి గావించె స్వా
ధీనం బీకృతికన్యభారమును సం•దీప్యద్యశోరాశి యై.
క॥ ఈదృశగుణాఖని యగు ల
క్ష్మీదేవికి నాపెపుత్రి•కిని బౌత్రికి నీ
మేదిని సద్యశమతు లా
మోదము సంధిల రచింపఁ • బూనితి దీనిన్. 70
వ॥ ఇటుల నభ్యుదయపరంపరాభివృద్ధిగ నాయొనర్పంబూనిన తుఖారా
మాహ్వాయసతీచరిత్రంబునకు గథాక్రమం బెట్టు లనిన.

శ్రీరస్తు.

# తుఖారామ్.

## ప్రథమాశ్వాసము

---

మ. మతి లోకోత్తరకీర్తి గన్నయన వే•మక్ష్మాతలాధీశ పా
లిత మై, యుత్కళభూతలేశరణకే•ళీధామ మై, మంజువా
క్పతురుం డా కవిసార్వభౌముని నివా•సప్రాంత మై, సౌధసం
భృత మై పొల్చెడు కొండవీడు జగమం• దేవీడు లే దీ డనన్. 1

మ. అరినిర్భేద్యబలిష్ఠదుర్గయుత మై • యత్యున్నతానేక భూ
ధరజాతాద్భుతగహ్వరస్థితమృగేం•ద్రవ్రాతగర్జారవా
కర మై భూరిమహీరుహవ్రజలస•త్కాంతారసంతానబం
ధుర మై తన్నగరాంతికంబు విధిచా•తుర్యంబునన్ బొల్చెడిన్. 2

ఉ. కట్టని రాతిగోడ లనఁ•గా గగనంబును రాయు నట్టు లా
పట్టణరాజమందు గిరి•పఙ్క్తు లనేకము లున్నతస్థితిన్
దిట్టతనంబు గల్గి రిపు•ధీరులచిత్తములన్ జలింపఁ గాఁ
జుట్టును నుండె నొండుకడఁ • జూచితిమే యిటువంటి గుట్టలన్. 3

ఉ. వృష్టిదినాళి నాగిరులఁ • బెల్లుగఁ బాఱు నదీజలంబులన్
దుష్టిగఁ గ్రోలి క్రేళ్లురుకు • తోరపు లేఁగల, లేడికూనలన్
బుష్టిగ నందఁ బైరగు వి•నూతనశాద్వలరాజిఁ గాంచఁగా
సృష్టివిచిత్రమున్ బొగడ • శేషుఁడు గూడ నశక్తుఁ డయ్యెడున్. 4

క. ఆపురిఁ బ్రతాపరుద్రమ
హీపాలుని పాలనమున • నృపవర్యులు ద
ర్పోపేతంబుగ నాతని
ప్రాపునఁ గొందఱు వసించి • పాలించి రొగిన్. 5

మత్తకోకిల. ఓరుగంటిప్రతాపరుద్రమ•హోర్వినాథుని ఫాదుషా
క్రూరుఁడై కొనిపోవ ఢిల్లికి•కుంఠితక్రియ నెందఱో
ధీరులౌచు స్వరాజ్యముల్ బలు•దిక్కులన్ నెలకొల్పఁగా
వారిలోపల రెడ్డిరాజు ల•వక్రవిక్రమశాలు రై, 6

ఉ. పేరును గన్నవాఁడు గడు • వీరుఁడు పోలయవేమరెడ్డి గం
భీరపరాక్రముం డగుచు • వేగమ తా వినుకొండఁ జేరి వి
స్తారపరావనీపతుల • శౌర్య మడంచి యపారరాజ్య మిం
పారఁగ జేకొనెన్ దశది•శావళి వైరులు భీతిఁ జెందఁగన్. 7

క. అంతట నాతని సుతుఁ డరి
సంతాపుఁడు సుకవివనవ•సంతుఁడు కరుణా
స్వాంతుం డన వేమమహీ
కాంతుఁడు రాజ్యంబు గొంత • కాలము సేసెన్. 8

సీ. తన బాహుబలముచే•తనె రాణ్మహేంద్రపు
రశ్రేష్ఠపర్యంత•రాజ్య మేలె
తన నిస్తులితసంస్కృ•తజ్ఞానపటిమచే
నమరుకంబునకు వ్యా•ఖ్యను రచించె
తన యాంధ్రభాషామ•తల్లిపైఁ గల ప్రేమ
హరివంశకృతిరాజ • మందికొనియె
తన విక్రమంబుచే•తనె పెక్కుసీమ లా
ర్జించి బాంధవకవి•శ్రేణి కొసఁగె

తే. గీ. నతని వర్ణింపఁ దగదె సం•తతయశోవి
రాజితుఁడు నిస్తులితకవి• రాజనుతుఁడు
ధీవిశాలుండు విబుధాశ్రి•తావనుండు
పూతగుణపాళి యన వేమ•భూపమౌళి. 9

తే. గీ. తొలుత నీ యన వేమభూ•తలవరుండు
తనకు నద్దంకియే రాజ•ధాని గాఁగఁ
జేసికొనియుఁ బిమ్మట దానిఁ • బాసి కొండ
వీడుఁ జేకొనె మించిన • వేడ్క నపుడు. 10

సీ॥ దృఢతరం బయిన భి•త్తికలచే నొప్పారు
చున్న తంగెడుదుర్గ • మొండు చోట
నంచితోన్నతిని రా•జించు నాగార్జున
కొండదుర్గంబు వే • ఱొండు చోట
విపులారివర్గని•ర్భేద్య మై దీపించు
నుదయాద్రివరదుర్గ • మొండుచోట
నద్దంకి వినుకొండ • యామీఁద బెల్లము
కొండదుర్గములు మ • ఱొండుచోట

తే. గీ. వెలయు గుండ్లకమ్మకుఁ గృష్ణ•వేణినదికి
మధ్యమునఁ గల యెల్లసీ•మలకు నెల్ల
రాజధాని యై మిగుల వి•రాజమాన
వైభవము గాంచె నాపుర•వరము కరము. 11

క. ఈకరణిని బాలించిరి
యేకధ్వజముగ నరాతి•బృందంబునకున్
భీకరు లై కవివరులకు
శ్రీకరు లై యానృపాల•శేఖరు లంతన్. 12

సీ॥ ఆకాలమందుఁ బ॰రావనీపతులు దో
ర్బల మొప్పఁగను గొప్ప ॰ రణ మొనర్ప
వచ్చుచుండిరి యందు ॰ భామినీవంశజుల్
సతతంబు నొకచెంప ॰ సందడింప
నటుపైనిఁ గటకదే॰శాధినాథులు స్వీయ
విక్రమంబును జూప ॰ భీతి దోఁప
నేతెంచుచుండి రీ ॰ రీతి నుండఁగ నల్ల
కల్లోలముగ నెల్ల॰కడల మిగుల
తే. గీ. నుద్ధతుల మధ్యమునఁ బేద ॰ కుండఁ దరము
గా దటందురు గాన ము॰ష్కరతురుష్క
గజపతీంద్రుల నలుగుళ్ళ ॰ గాసి జెందు
చుండె నెంతయు నానాఁడు ॰ కొండవీడు. 13

ఉ. ఎచ్చట నుండె నుత్కళ మ ॰ దెచ్చట నుండెను గొండవీడు నా
ముచ్చట దెత్తురేమొ యల ॰ భూవరు లెంతయు యోధవీరు లై
హెచ్చిన విక్రమంబున న॰హీనజయోత్సవ మొప్ప ధీరు లై
వచ్చిరి పాండుభూవిభుని ॰ వంశజు లీ కటకేశు లెన్నగన్. 14

చ. నరనుతధర్మనందను న॰నంతరమం దొక కొన్ని వేలయేం
డ్లరుగ నవక్రవిక్రమగు॰ణాఢ్యులు కేసరివంశసంభవుల్
ధరణిపు లెల్ల రౌ నన ము॰దంబున నుత్కళరాజ్య మంతయుర్
నిరుపమలీల నేలిరి వి॰నిర్మలకీర్తిదిగంతరాళు లై. 15

మ. అల భూనాథవరేణ్యులం దతులపు॰ణ్యశ్లోకుఁ డై మించిని
ర్మలకీర్తిద్యుతిరాజి రాజిలఁగ మా॰ర్కండేశ్వరస్వామికో
వెల నిర్మాణ మొనర్చి భక్తజనసం॰ప్రీతిప్రదుం డైన ని
స్తులితుర్ గుండల కేసరిప్రభుని బూ॰జ్యుం డందు రుర్వీజనుల్. 16

తే. గీ. ఈతని యనంతరమున న•హీనబాహు
బలయుతుఁడు నృపకేసరి • ప్రభువరుండు
రాజ్య మేలెను గటకపు•రంబు దనకు
రాజధానిగ నుత్కళ•రాజ్య మెల్ల. 17

చ. అటుపయిఁ గొన్ని యేండ్లరుగ • నయ్యెడఁ గేసరివంశ మంత మొం
దుటయును గంగవంశ మను • నూతనవంశ మొకండు వృద్ధిగాం
చుటయుఁ దటస్థమయ్యె నల • క్షోణిధవుల్ నిజవిక్రమంబునన్
గటకమునందు శాత్రవని•కాయము భీతిల నేలి రుద్ధతిన్. 18

తే. గీ. వీరిలోఁ గ్రీస్తుశక మొక • వేయియేండ్లు
నూట డెబ్బదై దేండ్లను • దాట రాజ్య
విస్తృతిని వహించె ననంగ•భీమదేవుఁ
డతఁడు శ్రీజగన్నాథాల•యంబు నిలిపె. 19

ఉ. కీర్తిశరీరు లై యిటుల • కేవలరాజ్యభరంబు గాక భూ
భర్తలు శాశ్వతంబు లయి • భాసిలు కార్యము లాచరించి స
ద్వర్తను లై యశేషజన•వందితు లై యలరారుచున్ సదా
యార్తజనావనాభిరతు • లైన నృపుల్ వినుతార్హులే గదా. 20

ఉ. నిండు ప్రతాపవహ్ని ధర•ణీతలమం దొరు లేరు సాటి రా
కుండ నరాతికీర్తిలత • లుద్ధతి భస్మము సేయుచున్ మహో
ద్దండత నాజి రుద్రుఁ డయి • దర్పము మీఱఁ బ్రతాపరుద్రదే
వుండు వహించె రాజ్యరమ • భూరియశంబున సార్థకాఖ్యుఁ డై. 21

సీ. ఈగతి వారిలో • నేలిరి కొందఱు
రాణ్మహేంద్రప్రాంత•రాజ్య మంత
మఱి కొందఱు నిరుప•మాను లై నిజకీర్తి
వల్లి నాటిరి కొండ•పల్లి దండ

నాజిదోహాళులయి • యటు కొండ అుదయూద్రి
దాఁకఁ బాలించి రు•ద్ధతి వహించి
యీరీతి రాజ్యవి•స్తారంబును గడించి
కొండవీటి దనుక • నుండి కటక

తే. గీ. రాజవరులు నిర్వక్రప•రాక్రమంబు
జాటు చుండిరి పెరవారు • సాటి రారు
నాఁగ నొక కొన్ని యేండ్లు భూ•నాథవర్యు
లనవరతమును దమ డెంద•మందుఁ గుంద. 22

క॥ ఈకరణిఁ గటకనాథులు
వీకన్ జనుదెంచి రాజ్య• విస్తారంబున్
జేకొని తత్ప్రాంతస్థధ
రాకాంతుల శౌర్యవహ్ని • రవులగఁ జేయన్. 23

తే. గీ. కామినీకుచోద్ధతి భీతిఁ • గని యదృశ్య
మయ్యెడి సతీవలగ్న మ • ట్లరుగు టొకటి
నిలచి కటివోలెఁ బెంపొంది • యలరు టొకటి
యందు శౌర్యాగ్రగణికి రెండ•వదియె తగును. 24

క॥ అటు లగుటఁ గదియు చుండిరి
పటుభీకరు లగు తురుష్క•వరు లాగ్రహకర్
జటులార్క్రపకరాంధః
పటలార్కులు విజయనగర•పతు లీగ్రహకర్. 25

తే. గీ. విజయనగరశబ్దమునందు • విజయశబ్ద
మలరుఁ గానఁ దదీయ రా•ష్ట్రాధినాథు
లతులవిజయాభిలాషు లై • యనవరతము
నుచితకాలంబునకు వేచి • యుండి రపుడు. 26

శా. ఆకాలంబున దివ్యవైభవయుతం • బై భూరిశైలవ్రజ
ప్రాకారాన్విత మై, యగాధపరిఘా • వ్రాతావృతం బై శిలా
నీకాంచద్ఘనకుడ్యరక్షితము నై • నిర్భేద్యదుర్గాళిచే
లోకంబం దసమానలీల విలసి • ల్లుం దత్పురం బెంతయున్. 27

సీ॥ అసమానసమరదో • హళభటోపేతంబు
విపులయోధవరేణ్య • విశ్రుతంబు
సముచితప్రజ్ఞావి • శాలమంత్రియుతంబు
సామంతరాజన్య • సంభృతంబు
లసదలంకృతజయ • లక్ష్మీనివాసంబు
దివ్యసుందరసౌధ • దీపితంబు
శత్రుభీకరదుర్గ • సముదయోల్లసితంబు
బహుళాశ్వగజరాజ • భాసితంబు
తే. గీ. నగుచుఁ జెన్నొందు చుండె! న • త్యధికవిభవ
దాయకంబు పంపానదీ • తోయరుహాఘు
మంఘుమపరీమళానిల • మండితంబు
విజయనగరంబు కళ్యాణ • విలసితంబు. 28

క. ఈపురనిర్మాణవిధం
బీపగిది వచింతు రార్యు • లెట్లన నరసిం
తాపుఁడు హరిహరబుక్కమ
హీపాలుఁడు రాజ్య మేలు • నెడఁ జిత్రముగన్. 29

సీ. ఒకనాఁడుశశరాజ • మొక్క జాగిలము ను
ద్ధతిమీర వింతగఁ • దాఁకి తుదకు
విజయంబు గాంచుట • వీక్షించి నిజమంత్రి
వర్యుల కీచిత్ర • వార్త దెలుప

నది స్థలమాహాత్మ్య • మని వార లెఱింగించి
పత్తనం బొం డండుఁ • గట్టు నెడల
విజయ మబ్బ నటంచు • వివరింప హరిహర
బుక్కభూపాలుఁ డ • ద్భుతము నొంది

తే. గీ. యాక్షణమ క్రీస్తుశకపు స • హస్రవర్ష
ములును మున్నూటముప్పదా • ఱులును గడువ
ధాతృవత్సర వైశాఖ • ధవళపక్ష
పంచమీ శుభలగ్నమం • దంచితముగ. 30

క. నిజదుర్గప్రాకార
వ్రజ మరిని ర్భేద్య మటుల • బంధురలీలన్
విజయోత్సుకుఁ డై యాపురి
విజయనగర మనెడి పేర • వెలయఁగఁ జేసెన్. 31

శా. విద్యారణ్యమహామునీంద్రుఁ డల పృ • థ్వీపాలు ప్రేమోల్ప్రథా
నోద్యోగంబున నుండి యీపురము నా • యుర్వీశుచే బుద్ధివై
శద్యం బొప్ప ననేకపర్వతమయ • స్థానంబునన్ శత్రుని
ర్భేద్యం బాగతిఁ దుంగభద్రదరి ని • ర్మింపంగఁ బ్రేరేచుటన్. 32

తే. గీ. ఈమహామహుపేరు వ • హించి మఱియు
వెలయు విద్యానగర మని • విజయనగర
మనియుఁ బదపడి సార్థకా • హ్వాయము నయ్యె
నిఖిలలోకవంద్యకవీంద్ర • నిలయ మగుట. 33

ఉ. ఆపుర రాజవైభవ మ • యారె! తదీయనృపాలిహర్మ్యముల్
గోపురమంటపాదులు న • కుంఠితసామజఘీంకృతుల్ సదా
దీపితభూషణాళిమణి • దీధితు లొప్పెడి పణ్యవీథు లౌరా
పరికించుచో మిగుల • నద్భుత మై కనుపట్టు నెప్పుడున్. 34

పంచచామరము. కరంబు సృష్టిచిత్రమొప్ప•గా నరాతివర్గభీ
కరంబు సంతతప్రమోద•కారణంబు సచ్ఛుభా
కరంబు సత్కవీంద్రపాళి•కల్పకంబు నైన త
త్పురంబు కృష్ణదేవరాయ•భూపుఁ డేలు నుద్ధతిన్. 35

క. ఈనరనాథుని కీర్తివి
తానము చతురబ్ధివేష్టి•తక్షోణితలం
బైనను జాలక పర్వఁగ
మానవమాత్రునకు శక్య•మా వర్ణింపన్. 36

ఉ. వీరనృసింహరాయపృథి•వీవరవార్ధిసుధాకరుండు దు
ర్వారపరాక్రముండు కవి•రాజవితాననుతప్రశస్తవి
స్తారయశోధనుండు రిపు•శాశ్వతకీర్తిలతాలవిత్రుఁ డెం
తేరమణీయసచ్చరితుఁ • డీనృపవర్యుఁడు నా విరాజిలెన్. 37

క. ఏతాదృశచరితుఁడు ధా
త్రీతలపాలనముఁ గొన్న•దియె తడవుగ సం
జాతజయోత్సాహము నిజ
చేతోవీథిని గరంబు • చిందులు ద్రొక్కన్. 38

సీ. అసమానమధురవా•గమృతసంభృతకవి
తాసరిత్కవులు స•త్కవులు వెలయ
పరసహనోపేత•బంధురశేముషీ
వితతమండితులు పం•డితులు సెలఁగ
ఆస్థానికవ్యవ•హారనిర్వాహణాస
మానస్వతంత్రులు • మంత్రు లలర
రాజకీయాదికా•ర్యవిచక్షణాగత
బహుళలౌక్యపరులు • వరులు గొలువ

ఆ. వె. ముఖ్యభృత్యగణము • ముకుళితహస్తు లై
యొక్క ప్రోల నిలచి • యుండఁ గృష్ణ
దేవరాయమౌళి • శీవి మై పేరోల
గమున నుండి నిండు • కౌతుకమున 39

సీ. ఏయనఘాత్ముం డ•హీన మేధావిశే
షమున సంపాదించె • సచివపదవి
ఏయుదారుండు వ•హించె సత్కృపఁ జూపి
యప్పాజి నా సార్థ•కాభిధేయ
మేయమాత్యవరుం డ • మేయదోర్బలశ క్తి
సాధించె సర్వసే•నాధిపత్య
మేజగన్నుతుఁ డొందె•రాజకీయార్థిక
తత్వజ్ఞుఁ డగుచు గు•రుత్వగరిమ

తే. గీ. అట్టి కీ ర్తివిశాలు గు•ణాలవాలు
స్వీయమంత్రివరేణ్యు స•ద్విబుధగణ్యుఁ
గాంచి యొకనాఁడు మందహా•సాంచితాస్యుఁ
డగుచు నిట్లని పలికె వా•గమృత మొలుక. 40

ఉ. 'సాళువనారసింహుఁ డతి•సాహసశాలి యమాత్యమౌళి యు
ద్వేలపరాక్రమంబునఁ ద•దీయనృపాలుఁడు యుక్తరీతి మై
పాలనభార మూనమిని • వానిని రాజ్యవిహీను ఁజేసి, తా
బాలకుఁ డయ్యెఁ దావకకృ•పామతిఁ గాదె యమాత్యశేఖరా. 41

ఉ. వానికి ముఖ్య మైన దళ•వాయిగ నుండిన నారసింహభూ
జానికి నాదుతండ్రికి న•జస్రము తోడ్పడుచుండి, మంత్రి వై
మానితరాజ్యలక్ష్మి నస•మానయశంబును గూర్చి తౌర యౌ
ధీనిధివర్య! నీ కవని • దీ టెవ రయ్యా యమాత్యశేఖరా. 42

ఉ. అంతియగాక వీరనర•సావనినాథుఁడు మత్సహోదరుం
డింతటి రాజ్యభారము వ•హించిన కాలము స్వల్ప మైనను
సంతతకీర్తిశాలి యయి • సన్నుతిఁ గాంచఁగఁ గల్గు టెన్న మీ
యంతటివారు మంత్రివరు • లై యలరారుటఁ గాదె వేండియున్. 43

క. గురుఁడవు సతతక్షేమం
కరుఁడవు నేర్పరుఁడ వతుల•కారుణ్యరసా
కరుఁడవు నిస్తులితయశ
స్కరుడవు నిను బోలు మంత్రి • గలఁడే జగతిన్. 44

ఉ. తావకమంత్రశక్తి నొకొ • దక్షిణదిగ్విజయాత్ర కేఁగి నే
నీవిధి మొన్న మొన్న గడి•యించితి రాజ్యరమావిశేష మీ
భూవలయంబునన్ శివస•ముద్రపుఁ గోటను బోలు కోట యెం
దే విలసిల్లునే? యది జ•యించితి నొక్కక్షణంబు లోపలన్. 45

ఉ. సంగరరంగమందున వ•శంవద మయ్యెఁగ నుమ్మటూరు శ్రీ
రంగపురాధినాథుఁడు ని•రంతరమున్ సువిధేయుఁ డౌచుఁ బం
పం గలవాఁడు కప్పము శు•భప్రద మై యలరారుఁ దత్పుర
ప్రాంగణమందు నాటిన జ•యధ్వజ మొప్పెడుఁ గీర్తిచిహ్న మై ॥ 46

సీ. వేలూరుప్రాంతంబు • విజయప్పనాయకుం
డేలుచుఁ గప్పంబు • లీయఁ గలఁడు
కొల్లడ మాదిగ • నెల్లూరు వఱకును
గృష్ణప్ప నాయకుం • డేలఁగలఁడు
గరిమతో విజయరా•ఘవనాయఁ డేలుఁ గా
వేరి పాఱుచు నున్న • సారభూమి
మఱియుఁ దిర్నల్వేలి • వఱకు గల్గిన దక్షి
ణపుసీమ వెంకప్ప•నాయఁ డేలు

తే. గీ. నీవిధిని మళయాళము • ద్రావిడాది
దేశములు గాక కర్ణాట• దేశ మెల్ల
మన యధీన మయ్యెను గదా • మంత్రివర్య!
భవదనూన కార్యవిధాన• పటిమ కతన' 47

మ. అనుచుం బల్కఁగ సాళ్వతిమ్మసచివుం • డానంద మింపార ని
ట్లనె ' స్వీయాశ్రితరాజిపైఁ గల కృపా• స్వాంతంబునన్ జేసి యీ
వినుతుల్ సల్పుచు నుంద్రు గాని యిది మా • విధ్యుక్తమేగాక చే
సిన సత్కార్య మనంగఁ నర్హ మగునే • శ్రీకృష్ణరాయాధిపా. 48

మ. భవదీయప్రథితాహవాద్భుతకళా• ప్రావీణ్యమున్ జేసి శా
త్రవరాజన్యవరుల్ వికావికలు లై • దర్పంబు వోనాడి, ని
చ్చ వనాభ్యంతర సీమలన్ స్థిరనివా• సశ్రేణు లెన్నే రచిం
చి విడన్ జాల రొకప్పుడున్ నిపుణు లై • శ్రీకృష్ణరాయాగ్రణీ. 49

క. ఈకరణిని గీర్తిరమన్
జేకొని మించితి ప్రతాప • శీలుఁడ వగుచున్
భూవర! కల విం కెన్నియొ
కావింపం దగిన యట్టి • కార్యము లవనిన్. 50

ఉ. కీర్తిలతాంగి యిక్కరణి • కేవల మాహవకేళిచే వశం
వర్తిని యౌ నటంచుఁ దల• పం దగ దింకను బెక్కులీల భూ
భర్తలు జెట్టబట్ట నగు • బంధురసత్కృతికన్యలన్ మన
స్ఫూర్తిగఁ జేరఁ దీసి కవి• పుంగవవంద్యచరిత్రు లై కదున్. ' 51

ఉ. నావుడు కృష్ణరాయజన• నాథుఁ డనెన్ దరహాసభాసుర
శ్రీ వెలయంగ నాసచివ• శేఖరుఁ గాంచి సముంచితోక్తిమై .
పావనశీల! నీ వనిన • పల్కులు గా దనరాదు గాని నా
భావమునం దజస్ర మెడఁ• బాయనికోర్కి యొకండు వింటివే. 52

తే. గీ. రాయచూ రుదయాద్రి దు•ర్గములు శత్రు
వీరుల కభేద్య మగు కొండ•వీటి దుర్గ
మొండు మాయధీనమున నె • యుండెఁ దొలుతఁ
బదపడి పరావనీశుల • పాల బడియె. 53

శా. ఓమంత్రీశ్వర! తొల్లి సాళ్వనరసిం•హోర్వీశుఁ డైనట్టి యా
మా ముత్తాతల నాఁటనుండియును సం•పాదింప నెత్నించి యు
న్నా మైనన్ సమయంబు జిక్కమిని సం•ధానంబు గానట్టి యా
సీమన్ గైకొని కీర్తిఁ గొందుఁ దమ యా•శీర్వాదభాగ్యంబుచేన్.

మ. అటులన్ సద్యశ మబ్బు టెంతయు నమా•త్యా! దోర్బలం బొప్ప ది
క్తటులన్ శత్రువితానకీర్తి ధనమున్ • ధ్వంసంబు గావించి,వి
స్ఫుటసామ్రాజ్య మఖండ వైభవమునన్ • బొల్పారు నందాఁక దు
ర్ఘట మాఁ గావునఁ బూర్వదిగ్విజయయా•త్రన్ గూడ సల్పన్ దగున్.

ఉ. వెండియుఁ గొండవీటికడ • విక్రమ మొప్పఁ బ్రతాపరుద్రదే
వుం డను నుత్కళేశ్వరుఁడు • భూరిచమూసముపేతుఁ జేసి యు
ద్దండత నుంచె స్వీయసుతు • దర్పసమన్వితు వీరభద్రునిన్
భండన మందు మంత్రివర!•వానిజయింపక కీర్తి గల్గునే. 56

క. కావున మన కిందుల కై
కావలసిన యోధవరని•కాయము రణవి
ద్యావిదు లగు భటజాలము
ధీ వెలయఁగఁ గూర్పు మయ్య • తిమ్మరుసయ్యా. 57

మ. అనినన్ సాళువతిమ్మమంత్రివరుడున్ • హర్షాంబుధిన్ దేలి యో
మనుజాధీశ్వర! నీదు కోర్కె గడు సం•భావ్యంబె యైనన్ మనం
బున యోజించిన శత్రురాజుల బలం•బుల్ లెక్కకు న్మించి యుం
డెనుగాదే మన సైనికవ్రజము కం•టెన్ దోర్బలోద్దాము లై. 58

క. వెండియు వినుమో భూవర!
కొండల కైన యయిన యట్టి • కుంజరబలముల్
దండిగఁ జేరిచి యీ భూ
మండలి గజపతులు నాఁగ • మాన్యతఁ గనరే. 59

క. ఎదిరిబలంబును దనబల
మెదఁ దలపోయక నృపాలుఁ • డెంతయుఁ ద్వరచేఁ
గదనమునకుఁ గడఁగిన న
భ్యుదయంబును జెందఁగలఁడె • యుర్వీనాథా! 60

ఉ. కావున సైన్యసంస్కరణ•కార్య మవశ్యము, దానిఁ దీర్ప నో
దేవర! నా కొకింత వ్యవ•ధిన్ దయసేయు మటంచుఁ గోరి సం
భావితఁ సాళ్వతిమ్మరుసు•మంత్రివరేణ్యుఁడు రాజకీయకా
ర్యావసరంబునన్ దగిలి • యంతయుఁ దీర్చె మహాద్భుతంబుగన్. 61

క. దండిగ ధనధాన్యాదుల
భండన మొనరించు తఱిని • వ్యయములకొఱకై
భాండారమ్ముల నిలిపె న
ఖండప్రతిభావిశేష•కౌశల మొప్పన్. 62

క. భార్గవనిభుఁ డా సచివుఁ డ
నర్గళగతి సంస్కరించె • నయకోవిదుఁ డై
దుర్గమము లైన యాపురి
దుర్గంబుల నెల్ల శత్రు•దుర్భేద్యముగా. 63

తే. గీ. కొత్తళంబుల మఱల బా•గుగ నొనర్చెఁ
గరము నిమ్నంబులుగఁ బరి•ఘలను దీర్చెఁ
బాళెములయందు విశ్వాస•పాత్రు లైన
దొరల నిలిపెను బుద్ధిచా•తుర్య మలర. 64

క. గోవిందామాత్యుని రణ
కోవిదు, బుధమాన్యుఁ దనదు ♦ కూరిమి తమ్మున్
గావించె నగరరక్షకుఁ
గా వసుధాధీశు నాజ్ఞ ♦ గైకొని యంతన్. 65

సీ. సాళ్వతిమ్మరుసయ్య ♦ సైన్య మెల్లను సప్త
భాగంబులుగఁ జేసి ♦ భాగమునకు
దృఢకాయు లై యుక్కు ♦ దేలిన భటులు ము
ప్పదివేల దనుకఁ గా♦ల్బలము గాఁగ
పారశీకోత్తమా♦శ్వములు నాలుగు వేల
వఱకుఁ గూడిన యశ్వ♦బలము గాఁగ
నిరులఁ బోలిన మద♦కరు లందు రెండునూ
ఱుల నేర్పఱచి గజ♦బలము గాఁగ

తే. గీ. నిర్ణయ మొనర్చి యాజి ను♦త్తీర్ణు లైన
ధీరవర్యుల ససహాయ♦శూరధనుల
నాయకులఁ జేసి సర్వసై♦న్యంబులకుఁ బ్ర
ధానుఁడుగఁ దాన యుండె నా ♦ తరుణమందు. 66

ఉ. మేటి పరాక్రమాఢ్యుఁ డయి ♦ మీసముల్ మెలివెట్టుకొంచు నా
ర్వీటికులాబ్ధిచంద్రుఁ డరి♦భీకరు డై చనుదెంచె నప్పు క
ర్ణాటచమూవిభుం డగుచు ♦ రమ్యయశోలతల్ దిశావళిన్
నాటఁగ నందియాలపురం ♦ నాథుఁడునారపరాజు వేడుకన్. 67

సుగంధి. ఆకువీటిదుర్గనాథుఁ ♦ డైన యిమ్మరాజు శౌ
ర్యాకరుండు సంగరోత్స♦కాన్వితాంతరంగుఁ డై
నాకలోకసౌఖ్యముల్ బ♦రాళికిన్ ఘటింప ని
ర్వైకదీక్షతోడ నప్పు ♦ డేఁగుదెంచె నాజికిన్. 68

తే. గీ. అతులకందనోలుపురీశుఁ • డైన భాను
తేజుఁ డార్వీటి శ్రీరంగ•రాజు వచ్చె
సకలసేనాసమేతుఁ డై • సమరమునకు
క్షాత్త్రధర్మంబు మెఱయ నా • క్షణమునందు. 69

ఉ. ఎన్నఁగ గండికోటపుర • మేలెడివాఁ డసమానశౌర్యసం
పన్నుఁడు పెమ్మసానికుల•వార్ధిసుధాకరుఁ డైన రామలిం
గన్నను మించు విక్రముని • గన్నది విన్నది లేదు నాఁ గడున్
సన్నుతి గన్నయాతఁడును • సంగరకేళికి వచ్చె నత్తఱిన్. 70

చ. ఎవని ప్రతాపకాంతి దిశ • లెల్లను బర్వఁగ బింబచూతప
ల్లవతతి నా భ్రమంబునఁ గు•లాయములన్ విడి కీరకోకిల
ప్రవరము లెల్ల బాఱు నల • భవ్యుఁడు శ్రీవెలుగోటివంశసం
భవుఁడు కుమారతిమ్మనర•పాలుఁడు వచ్చెఁ జమూసమేతుఁ డై.

ఉ. కొండల నెల్ల రాయసము • కొండమనాయఁడె పిండి సేయు ను
ద్దండుఁ డటంచుఁ బల్కఁ దగు • దర్పయుతుం డసమానశత్రువే
దండమదస్రవంతి సత•తం బినుకన్ ఘనసింహనాదముల్
మెండుగఁ జేయుచున్ వెడలె • మేటిపరాక్రమ మాజి జూపఁగన్

ఉ. శ్రీయుతమూర్తి పంటకుల•శేఖరుఁ డాజిభయంకరుండు గాం
గేయసమానవిక్రముఁడు • కేవలకీర్తిధనుండు రూపనా
రాయణుఁ డన్న భవ్యబిరు•దాంకుడు వైరివిదారణార్హ కౌ
క్షేయుముఁ బూని హస్తమునఁ • జేరఁగవచ్చెను గృష్ణరాయునిన్. 73

తే. గీ. ఇటులఁ జనుదెంచినట్టి యా • యేడ్వురను ద
దీయసప్తభాగములకు • నాయకులుగఁ
జేసి యెల్లెడలను దాన • చెలగుచుండి
సర్వమాయత్త మొనరించె • సచివుఁ డంత. 74

సీ. తమ తేల యశ మట్లు • ధవళదీధితు లీను
రజితభూషణరుచి•వ్రజము సెలఁగ
కిణకిణకింకిణీ•గణనిక్వణంబులు
శ్రవణపర్వము లయి • సందడింప
నిజపదవిన్యాస•నియతి దుందుభిరవ
చయమున కను వైన • లయ ఘటింప
అరివీరు లన నెంత • యని హాస మొనరించు
సరణి హేషాధ్వను ల్ • గరము దనర
తే. గీ. పారశీకవనాయుజ•బాహ్లికాది
బహుళదేశోత్తమతురంగ•బలముఁ గొనుచు
వెడలి రపుడు శ్రీకృష్ణరా•డ్విభునితోడ
వీరవరు లైన కొందఱు • వెలమదొరలు. 75

చ. గజపతిముఖ్యసైనికని•కాయము గుండెలు బ్రిద్ద లై కడున్
గిజగిజ లాడు న ట్లతుల•ఘీంకృతులన్ ఘటియింపుచున్ సదా
గజబల మొక్క కొంత యల • కాటుకకొండలఁ బోలి యెంతయున్
నిజవిభుఁ గృష్ణరాయధర•ణీపతిఁ జేరఁగ వచ్చె న త్తఱిన్. 76

సీ. మేటిసేనానుల • నీటె మొనలఁ గ్రుచ్చి
పై కెత్తుదు మటంచుఁ • బలుకువారు
కనఁబడు శత్రువ•ర్గము నెల్లఁ జెఱుకుతుం
టల రీతి నఱకంగఁ • దలఁచువారు
ఎదిరించు సరదార్ల • నేని ఘోరాసికి
బలియిత్తు మని దీక్ష• సలుపువారు
దండికొండల నైనఁ • బిండిసేసి యరాతి
ఘనదుర్గములఁ గొందు • మనెడివారు

తే. గీ. నగుచు సమరోత్సుకంబున • నధిగమించి
యీ తెలుఁగటార్లు బల్లెంబు • లితరము లగు
నాయుధవిశేషములఁ గొంచు • నా నృపాల
మాళితోఁ గాల్బలము గొంత • బైలు దేరె. 77

ఉ. తిమ్మరుసయ్య యిక్కరణి • ధీవిభవంబున భూపునాజ్ఞ స
ర్వమ్మును జేసి సిద్ధముగఁ • బార్థివ మాళిని గాంచి పల్కె రా
జ్యమ్మునఁ దావకీయకృప • నంతయు సిద్ధము సేసినాఁడ యు
ద్ధమ్మునకున్ గడంగుటయె • తక్క మఱొండు కొఱంత లేదనన్.78

క. అందులకున్ డెందంబునఁ
గందళితానందుఁ డగుచు • క్ష్మావరుఁ డనియెన్
వందితధీసంపన్నుఁడ
వందురు నేఁ డద్ది స్పష్ట • మయ్యె మహాత్మా. 79

క. తృటికాలములో సర్వం
బెటువలె నేకొఱత లేక • యెటు దీర్చితివో
ఘటనాఘటనసమర్థత
యటుపయి ధీవైభవంబు • నలవడ కున్నన్. 80

చ. అంచు నమాత్యశేఖరు నమంచితరీతిఁ బ్రశంస సేయుచున్
మించిన వేడ్కఁ జెంది పుడమీధవుఁ డాహవభూమిఁ జేర రా
వించి సమస్తయోధవర • వీరనికాయము; వారిఁ బ్రీతి వీ
క్షించి వచించెఁ జిత్తముల గేవలవీరరసంబు పుట్టఁగన్. 81

మ. వినుఁడీ యోధవరేణ్యులార! కటకోర్వీనాథుఁ డీరీతి సం
జనితాఖర్వబలంబు మీఱ నిజరాజ్యం బుత్కళం బెల్లఁగా
మన యాంధ్రావనిఁ గొండవీటిదరి సీమల్ గొంచు నం దద్ధతిన్
దన కెవ్వారలు సాటి లే రని కదా • స్థాపించె గర్వాంధుఁడై. 82

ఉ. సంగరరంగమం దతుల•శౌర్యపరాక్రమముల్ విరాజిలన్
భంగ మొనర్పఁగావలె న•భంగురలీలఁ బరాశయంబు లె
ల్లం, గడుసింగపుం గొదమ•లన్ బురడించుచు విక్రమంబుఁ జూ
పం గడతేర్పఁ గావలయు • వైరివరేణ్యుల నంచు వెండియున్. 83

క. రమ్మా రణకేళికిఁ గై
కొమ్మా దళవాయిపదవి •గొంకక జయమున్
దెమ్మా క్రమ్మఱ సాళువ
తిమ్మామాత్యా! ప్రతాప•దీధితు లొలయన్. 84

మ. అనుచున్ దిమ్మయమంత్రి నట్లఖిలసై•న్యాధ్యక్షుఁగాఁ జేయ నా
ఘనకౌశల్యుఁడు దత్తదర్హవిధులన్ • గావింపుచున్ నేర్పుమై
జననాథాగ్రణి కెప్పుడున్ గల భవి•ష్యత్సంగతుల్ దెల్పుచున్
జనుదెంచెన్ నిజశేముషీవిభవ మ•శ్రాంతంబు దీపింపఁగన్. 85

మ. అనఘున్ మంత్రివరేణ్యుఁ దిమ్మరుసు సై•న్యాధీశుగా, ధీరు లా
ఘనులన్ బంటకులాన్వయప్రముఖులన్• గమ్మప్రభూత్తంసులన్
వినుతప్రజ్ఞులఁ బద్మనాయకకులా•విఖ్యాతులన్ బ్రీతిమైఁ
గనుచున్ వారల నెల్ల నాయకులుగాఁ • గావించి తా నంతటన్. 86

సీ. తతరత్నరుచులచే • దశదిశల్ వెలిగించు
మేలు కల్కితురాయి • మౌళిఁ జెలఁగ
ఆశ్రితావనము లై • యలరు కటాక్షవీ
క్షణములు గనుదోయి • సతత మొలయ
అరిభయంకరహేతు • వైన వీరరసంబు
కోరమీసంబులఁ • గ్రుమ్మరింప
పరిపంథిగంధసిం•ధురవిదారణకర
వాలరాజం బొక్క • కేలఁ గ్రాల

తే. గీ. భేరిభాంకారదుందుభి•భూరిరవము
భూనభోంతరాళంబుల • భోరు కొలుప
సామజారోహణుం డయి • సమర కేళి
సేయ వెడలెను శ్రీకృష్ణ•రాయమౌళి. 87

సీ. రణభేరిభాంకార•రవము యోధవరేణ్య
హుంకారములతోడ • నోలలాడ
అశ్వహేషాధ్వనుల్ • హస్తిఘీంకారమం
జులగీతములతోడఁ • గలసి పాడ
వందిమాగధుల కై•వారముల్ బుధజనా
శీరవంబులతోడఁ • జెలిమిగూడ
శితకరవాలదీ•పితదగద్ధగరుచుల్
కీర్తికాంతులతోడఁ • గెరలియాడ

తే. గీ. ప్రథితరణకేళికయి కృష్ణ•రాయమౌళి
యరుగు చుండంగ భవ్యహ•ర్మ్యముల నిలచి
గరుడగంధర్వతుల్యసుం•దరులు పుష్ప
వర్షమును గురిపించి ర•వ్వారి గాఁగ. 88

ఉ. ఈగతిఁ గృష్ణరాయధర•ణీశుఁడు కోటలు పేటలున్ గడున్
వేగము మీఱి దాటి యట•వీస్థలిఁ జేరఁగ నాఁటి చిత్ర మెం
తేఁ గనులారఁ గాంచి యది • యెల్లను రాజునకు న్వచింపఁగా
నేఁగెడు నాఁగ నీడ లపు • డెన్నఁగ దీర్ఘము లయ్యె వెండియున్. 89

చ. అనుపమకృష్ణరాయమను•జాధిపమౌళిపరాక్రమానలం
బును మదిఁ గాంచి విస్మయముఁ • బొంది స్వకీయకరప్రతాపసం
జనితవినూత్న తేజ ముది • సాటియె యంచుఁ గరంబు లజ్జమై
వననిధిఁ జొచ్చెనో యనఁగ • భానుఁడు గ్రుంకెను బశ్చిమాంబుధిన్.

మ. తన వంశోద్భవుఁ డిత్తెఱంగున మహా•దర్పంబుమై దిక్తతిన్
ఘనసత్కీర్తి లతాళి నిల్పు నను నా•నందంబునన్ మించి ప్రే
మను మార్గశ్రీమ మెల్లఁ దీర్ప నన శుం•భత్కౌముదీస్తోమమున్
గొనుచున్ బాంధసుఖప్రదుం డగు శశాం•కుం డొప్ప గా నంతటన్

ఉ. నాటికి దండు నాపి నర•నాథుఁడు వెల్లగుడారముల్ చమూ
కోటికి దండనాయకుల•కున్ వెలిపట్లు గుడారముల్ దదీ
యాటవి నాట బంచి ముద•మార నమాత్యునితోడఁ గూడి యా
పూట రణప్రసంగములఁ•బ్రొద్దులువుచ్చుచు నిద్రవోవఁగన్. 92

మ॥ ఉదయాద్రీంద్రము కృష్ణరాయఁ డిటపై•నుద్యత్ప్రతాపానలం
బుదయింపన్ గొన నున్న వాఁ డనుచు నా•యుర్వీశు మేల్కొల్ప నా
యుదయాద్రిన్ రవి దోఁచె నంత నిట భూ•పోత్తంసుఁడున్ గాల్యముల్
దుద ముట్టన్ వడిఁ దీర్చి మంత్రివరు నా•లోకించి తా నిట్లనెన్. 93

ఉ. డెందమునన్ గరం బినుమ•డించిన కోర్కెని గొండవీడు గై
కొందమటంచు సేనఁ గొని•కొంకక వచ్చితి మైన నీయెడన్
విందుము శైలదుర్గము ల•నేకము లుండిన యట్లు గావునన్
ముందుగ దేని, మంత్రివరఁ•ముట్టడి సేయఁగ నొప్పుఁ జెప్పుమా.

చ. అన విని మంత్రి యిట్లనియె•నా కటకేంద్రుఁడు కొండవీటిచెం
తను దనపుత్రకున్ మఱియు•దక్కిన సేనల విక్రమాఢ్యు లా
ఘనులను నిల్పి తాఁ బయిని•గాంచుచు నుండెను గాన నేర్పుపెం
పునఁ గడతేర్పఁ గావలయు•భూవర! శత్రుల నెల్ల నుద్ధతిన్. 95

చ॥ అదియునుగాక దుర్గముల•కన్నిటిలోఁ గడు దుర్గమంబుగా
నుదయగిరీంద్రదుర్గ మిల•నొప్పు నఁ టందురు గాన దానినే
మొదట జయింతుమేని రిపు•ముఖ్యులు భీతిలి పాఱకుందురే
పదపడి దక్కు దుర్గములు•బొల్పడకుండునె మాట మాత్రలో. 96

చ. నరవర! వెండియు న్వీనుము ♦ నాలుగునూర్లు సమున్నతస్థితిన్
బిరుసగు వాజిరాజి పది♦వేవురు కాల్బలముల్ సెలంగఁగాఁ
దిరుమలకాంతరాయఁ డతి♦ధీరత నాయుదయాద్రి మోసలన్
నిరతముఁ గాచు దానిఁ గడు ♦ నేర్పున ముట్టడి సేయ నో నసన్.

ఉ. వాస్తవమిద్ది మీ రొసఁగు ♦ భవ్యనియోగము మా కజస్రమున్
స్వస్తి యటంచు నా యుదయ♦శైలము సంభృతశస్త్రజాలమున్
దుస్తరయోధరక్షితసు♦దుర్గము దుర్గమవప్రవర్గమున్
నిస్తులలీల నుక్కడచి ♦ నిల్పుడు దిక్కులఁ గీర్తిదీప్తులన్. 98

చ. అనుచుఁ బ్రతిజ్ఞఁ బూని యుద♦యాద్రిని ముట్టడి సేయఁగా నను
జ్ఞను నృపుఁ డిచ్చుటే తడవు♦గా రణభేరి ధణంధణార్భటిన్
ఘనవిపినాంతరస్థపృథు♦గహ్వరవర్గము మాఱుమ్రోవ ని
ట్లనుపమవైఖరిన్ వెడలి ♦ రాహవకేళికి సైనికోత్తముల్. 99

తే. గీ. అటులఁ గతిపయదివసప్ర♦యాణ మాచ
రించి యుదయాచలము సమీ♦పించి కృష్ణ
రాయఁ డాత్మీయసేనాని♦కాయమునకు
హెచ్చరిక సేయ వారు పె ♦ న్మచ్చరమున. 100

ఉ. కట్టని గోడ లట్టుల నగ♦ప్రతతిన్ దగు తత్పురిం దరిమున్
ముట్టడిఁ జేసి రా యెడను ♦ ముప్పదినాలుగువేలసైనికుల్
చట్టుల చుట్టు నష్టశత♦సామజయోధము లొక్కపెట్టునన్
ఘట్టన సేయుచున్ గదిసె ♦ గండశిలాతతు లూడ బెల్లుగన్. 101

ఉ. అప్పుడు శత్రుసేనలు న♦గాగ్రము లెక్కి మహోగ్రమూర్తులై
తెప్పునఁ దప్తతైలవిత♦తిన్, శితశస్త్రసముత్కరోన్నతిన్
గుప్పలు తిప్పలై గుటియఁ ♦ గుంజరతుల్యశిలాళి ముంచుచున్
జెప్పెడి దేమి సేయఁగల ♦ నేఁతల నెల్లను జేసి రయ్యెడన్. 102

సీ. ఒకప్రక్క నునుపెక్కి • యున్న కొండల నెక్కి
కాలు జారఁగ ద్రెళ్లి • కూలువారు
ఒకమ్రోల నెగఁబ్రాకి • యురుశిలాతతి దాఁకి
క్ష్మాతలంబునఁ బడి • మడియువారు
ఒకచాయఁ జెలరేఁగి • చకచకగతి నేఁగి
శాతాస్త్రతతులచే • సమయువారు
ఒకట లగ్గలు వట్టి • యును బైని బడునట్టి
తప్తతైలములచేఁ • దడియువారు

తే. గీ. నగుచుఁ గొంతకాలం బుద • యాచలంబు
చలము మీఱి ముట్టడిఁ జేసి • చచ్చుచుండి
రంతియే గాని లాభ మా • వంతయేని
గలుగమికిఁ గృష్ణరాయభూ • కాంతుఁ డపుడు. 103

తే. గీ. ఏమియును దోఁపకున్న నా • కింతసేపు
చిత్తమందు యోజించి య • త్యుత్తమాశ్వ
మెక్కి నలుదిక్కులను దద్గి • రీంద్ర మపుడు
కాంచు తలఁపున నృపుఁ డేఁగు • దెంచె నంత. 104

శా. అశ్వారోహణుఁడై జయాభిరతి నా • యావైపులన్ గ్రుమ్మరన్
శశ్వత్కీర్తిధనుండు మార్గ మొకచో • సాంద్రాచలం బై చొరన్
నిశ్వాసంబుల కే నశక్య మగు దా • నిన్ గాంచి భూపాలుఁ డిం
ద్రైశ్వర్యంబులఁ జూరఁ గొన్నగతి న • త్యానందుఁడై మంత్రితో. 105

ఆ. వె. కాంచినాఁ డ నిపుడు • కడు సన్నమగు మార్గ
మొందు దాన నొక్క • రొక్క రేఁగఁ
జనును గాని యొక్క • సారి యిర్వురుగూడి
యరుగ సందు లేని • యట్టిదాని 106

క. కావున నను నగు మార్గము
గావింపఁగ నాజ్ఞ సేయఁ • గావలె ననఁగా
నావిధమును దత్క్షణము చ
మూవరులకుఁ దెలిపె సచివ•ముఖ్యుం డంతన్. 107

సీ. ఇరుపార్శ్వములఁ గొండ•చరులఁ గొండలు రంధ్ర
ముల నదేపని గాఁగఁ • దొలచు చుండఁ
దొలచిన యారంధ్ర•ముల యందు వే ఱొక్క
కొండలు మందును • గూరుచుండఁ
గూరిన మందును • గొండలు కాల్చి యా
కొండలఁ బగులఁగాఁ • గొట్టుచుండఁ
బగులఁ గొట్టిన కొండ • బండలఁ గొండలు
వే ఱొక్క తావునఁ • బేర్చుచుండ
తే. గీ. నటుల నాగొంది ధారాళ • మైన మార్గ
ముగ నొనర్చి నిరాటంక•ముగ సమస్త
సేన లందుఁ బ్రవేశించి • శీఘ్రగతిని
దాకి పోరె రా గజపతి • దర్ప ముడుగ. 108

ఉ. ఈసరణిన్ దదీయమను•జేశ్వరుఁ డాయుదయాద్రిదుర్గమున్
డాసె, భయంకరార్భటిఁ గ•డంగుచు నప్పుడు సర్వసైన్యముల్
దూసెఁ గృపాణజాతము వి•లోలగతిన్ రిపురాజ్యలక్ష్మియున్
బాసె నరాతివీరవర•భవ్యయశంబును మాసె నెంతయున్. 109

క. కష్టమని పట్టు విడువక
యష్టాదశమాసములు భయావహముగ ను
త్కృష్టగతి దుర్గరాజము
నష్టము గావించెఁ మనుజ•నాథుని సేనల్. 110

చ. అంత నరాతివర్గమున • కాహవభూమిని నిల్వ ధైర్య మా
వంతయు లేకపోయె, నిశి•తాశుగవర్షపరంపరాహతిన్
స్వాంతము నొవ్వ నాయె రణ•పార్థుని గృష్ణుని బాహుదర్ప మ
శ్రాంత మనంతతేజమునఁ • గ్రాలఁగ నాయె, ననంతరంబునన్. 111

శా. కర్తవ్యం బెదఁ దోప కున్కి కటక•క్ష్మానాథు సేనావ్రజం
బార్తిం జెంది పలాయనం బగుచు నా•యాంకుంజముల్ దూరఁ ద
ద్భర్తన్ దిర్మలకాంతరాయని వడిన్• బంధీకృతున్ జేసి స
త్కీర్తిస్తోముఁడు కృష్ణరాయఁడు ముదా•బ్ధిన్ దేలి యచ్చోటునన్.

క. రాయసవంశోద్భవుఁడు న
మేయపరాక్రమధనుండు • మేటిమగఁడు నా
ధీయుతుఁ గొండమరుసు శ్రీ
రాయలవా రుంచి రా పురము రక్షింపన్. 113

ఉ. అత్తఱి వెండియున్ శుభగు•ణాత్తయనం దగు నుత్కళేశుచే
నత్తను బూజనీయ మయి•నట్టి శిలామయకృష్ణవిగ్రహం
బుత్తమవంశజాతుఁ డయి • యొప్పిన తిర్మలకాంతరాయనిన్
దత్తదశేషవైభవవి•తానము నంపెను రాజధానికిన్. 114

తే. గీ. ఇటుల నాయుదయాద్రి• శ్రీకృష్ణరాయ
భూతలేంద్రుఁడు సాధించి • ఖ్యాతి గాంచి
విజయభేరీరవము దిశల్ • విస్తరిల్ల
కొండవీటిదుర్గము దాఁకు• కోర్కె వెడలె. 115

శా. ఆలీలన్ జను చుండి ప్రపథమమం• దద్దంకి వీక్షించి భూ
పాలాగ్రణ్యుఁడు స్వీయవిక్రమము సూ•పన్ ఘోర సేనాను లు
ద్వేలప్రజ్ఞలతోడఁ బోరుచు మహా•భీలప్రతాపానల
జ్వాలాళిన్ దపియింపఁ జేసి రిపులన్ • సాధించి రా దుర్గమున్.

మ. అటుపైఁ బోవుచు మార్గమధ్యమున న•త్యంతప్రతాపోద్ధతిన్
జటులారాతిశరణ్య మైన వినుకొం•డన్ దాకి యొక్కుమ్మడిన్
గటకోర్వీశు మనంబు తల్లడిల సం•గ్రామంబునన్ దచ్చమూ
పటలిన్ జిందరవందఁ జేసి కొనె భూ•పాలుండు దద్దుర్గమున్. 117

ఉ॥ అంతట నేఁగి యేఁగి మను•జాధిపచంద్రుఁడు ధీరుఁ డై తదీ
యాంతిక మందు శత్రునిల•యం బగు బెల్లముకొండ గాంచి యా
చెంతఁ జమూతతిన్ నిలిపి • సేనల కాజ్ఞ యిడంగ నేర్పు పెం
పెంతయు నేర్పడన్ గెలిచి • రిద్ధపరాక్రమ మాజి జూపుచున్, 118

మ॥ మఱియున్ బోవుచు శత్రుభీకరగతిన్ • శ్రీమన్నాథుఁ డీక్షించె న
త్తఱి నాగార్జునకొండ నంత మది గ్రో•ధస్ఫూర్తిఁ దత్సైన్యమున్
గఱకుంగత్తుల దూసి యేసి కరమున్ • గాసింబడన్ జేసి కొం
డఱ శైలాళికిఁ బాఱఁద్రోలి కొనియెన్ • దద్దుర్గమున్ వెండియున్

తే. గీ. ఈ తెఱంగునఁ దంగేడు • కేతవరము
మొదలుగాఁ గల దుర్గసం•పదలఁ గొనుచు
మేటి కృష్ణరాయలచమూ•కోటి దాడి
వెడలి విడిసె నుద్ధతిఁ గొండ•వీటి దండ. 120

ఉ. ఆయెడ సంతసం బలర •నావనసీమ విరాజమాన మా
నాయత సృష్టిచిత్రముల • నారయ నొక్క సమున్నతస్థలిన్
రాయలవారు భవ్యశిబి•రంబులు వేయఁగఁ బంచి కావలిన్
గాయఁగ వీరపుంగవని•కాయము నచ్చట నుంచి రత్తఱిన్.

చ॥ అతులిత దుర్గరాజముల • నాహవరంగమునన్ జయించి ది
క్తతులఁ బ్రతాపవహ్ని వెలు•గన్ దమమీఁదికి కృష్ణరాయభూ
పతి రణభేరిదుందుభిర•వంబులు రోదసి మాఱుమ్రోవ నీ
గతిఁ జనుదేరఁ గాంచి కట•కప్రభుసూనుఁడు వీరభద్రుఁడున్. 122

సీ. భూరిప్రతాపరా • చూరి మల్లాఖాను
భండనోద్దండు ను • ద్దండఖాను
వాసిగాంచిన పూస • పాటి వంశపు రాచి
రాజు లక్ష్మీపతి • రాజు మఱియు
సమరభీముం డన • రాజాలు పశ్చిమబాల
చంద్రమహాపాత్రు • సాహసాంకు
శ్రీనాథరాజు నాఁ • జెలఁగు విక్రమతేజు
విజయాంకుఁ డగు మహా • వీరపాత్రు
తే. గీ. మున్నుగాఁ గల సామంత • ముఖ్యవితతిఁ
గొండవీటి దుర్గము గాచు • చుండ, వీర
భద్రగజపతి తన ప్రతా • పంబు సూప
సమరసన్నద్ధుఁ డయ్యె నా • సమయమందు. 123

ఉ. అంతఁ బ్రతాపరుద్రమను • జాధిపుఁ డుత్కలరాజ్యపాలకుం
డింతకు మున్నె చారుఁ డట • కేఁగి వచింపఁగ నీ యుదంత మా
ద్యంతము నాలకించి ప్రళ • యానలభంగిఁ బ్రతాపవహ్ని ది
క్సంతతిఁ బ్రజ్వరిల్ల విల • సద్భుజగర్వము పెంపు సూపఁగన్. 124

సీ. గజపతి యను సార్థ • కం బగు గతిఁ బ్రద్యో
దశశతమదకరీం • ద్రములతోడ
తుంగ త్తరంగసం • దోహభంగిని బొల్చు
వింశత్సహస్రాశ్వ • వితతితోడ
నేల యీనినయట్టి • లీలఁ దోఁచెడి యైదు
లక్షలు మించు కాల్బలముతోడ
నిఖలది క్తటికామి • నీగర్భభేద్య మా
రణభేరిభాంకార • రవముతోడ

తే. గీ. కోపఘూర్ణితుఁ డగుచుఁ బ్రతాపరుద్ర
గజపతీంద్రుండు నిజకటకంబుఁ బాసి
సమరభీము శ్రీకృష్ణరాడ్సార్వభౌము
డాయఁ జనుదెంచె మేదురాడంబరమున. 125

క. అప్పుగిది నుత్కళేశుఁడు
చప్పున సైన్యములఁ గొంచుఁ • జనుదేరెడి యా
చొప్పు గని కృష్ణరాయం
డప్పాజిం గాంచి యిట్టు • లనియె మృదూక్తిన్. 126

ఉ. మించిన బాహుగర్వమున • మేటిచమూనిచయంబు గొంచుఁ బ్రా
పంచిక సౌఖ్య మింకఁ గను • భాగ్యము వానికి లేమి నేమొ యే
తెంచెడు నుత్కళేశుఁ డదె • ధీరగుణాకర! మంత్రిశేఖరా!
కాంచితె వాని నేన చని • గర్వ మడంచెద నాజి వెండియున్. 127

ఉ. కొంచెపు బాముసేనియును • గొట్టఁగ నోఁ గద పెద్దకఱ్ఱచే
నంచుఁ దలంచి యుంచెద సమంచితసైన్యము మిమ్ము నిందు, నే
వంచనచేత నైన రిపువర్గము నుక్కడగించి కీర్తి ప్రా
ప్తించెడు దాఁకఁ బోరవలె • ధీవిభవంబును దోడు సూపఁగన్. 128

మ. అనుచున్ దిమ్మరుసయ్య నం దునిచి సైన్యస్తోమమున్ గొంత కై
కొనుచున్ గృష్ణనృపాలచంద్రుఁ డతులక్రోధాత్ముఁడై యుత్కలే
శుని దోర్గర్వము రూపుమాపఁ జనె నా • క్షోణీశుఁడున్ గృష్ణరా
యని నోడింపఁగ వచ్చె సైన్యతతితో • నత్యుగ్రరుద్రాకృతిన్. 129

ఆ. వె. ఇటుల వచ్చి కృష్ణ • కిరుపార్శ్వములలోన
నుత్తరంబునందు • నుత్కళేశుఁ
డుండ దక్షిణమున • నుండి శ్రీకృష్ణరా
యప్రభుండు దెలిపె • నతని కిటుల. 130

ఉ. ఏటిని దాటు కాలమున • నిర్వీర సైన్యము నష్ట మొందు న
ట్లేటికిఁ బోరఁగావలయు • నించుక వెన్కకు మీర లేఁగుచో
నేటిని దాటి వత్తు మిట • కీ రరుదెంచిన వెన్క కేము ము
మ్మాటికి బోవువారము క్ర•మంబుగఁ దెల్పుఁడు మీయభీష్టముల్.

క. అని సందేశము నంపఁగ
విని మిన్నక యున్న కటక•విభు చందంబుల్
గని కృష్ణరాయఁ డాకృ
ష్ణను దాటి కడంగె ఘోర•సంగరమునకున్. 132

సీ. ఏచాయ గాంచిన • హేషాధ్వనులతోడఁ
గర మలరెడి తురం•గముల గములు
ఏవంక గనిన న•హీనఘీంకారశ
బ్దములచే మించు వే•దండతండ
మేవైపు నీక్షింప • నిం తేని జంకక
నిలచి పోరాడు సై•నికనికాయ
మేదండఁ జూచిన• హేరాళ మై యున్న
రణభేరిదుందుభి•రవము కరము

తే. గీ. నలరు చుండ నశ్వములతో • నశ్వతతులు
సామజంబులతో మద•సామజములు
వీరసైనికవితతితో • వీరచయము
గలసి పోరె నయ్యెడ భయం•కరము గాఁగ. 133

సీ. పోటుబంటుల రీతి • మేటిశౌర్యముఁ జూపి
కోటలు గూల్చు నా•ర్వీటివారు
సాటిలేని ప్రతాప•ధాటిచే శాత్రవ
కోటి నుక్కడచు వెం•గ్లోటివారు

కంటఁ బడిన మేటి•బంటులఁ జెండు ము
క్కంటిఁ బోలిన తెర•గంటివారు
ఆలంబులో శత్రు•జాలంబు వెసఁ బాఱఁ
ద్రోలఁ గల్గిన నంది•యాలవారు
తే. గీ. వీరు లై నిల్చి పోరు గో•బ్బూరివారు
మానితప్రతాపులు పెమ్మ•సానివారు
బూదహాళివారు నొకువా • రాదిగాఁగ
ధీరు లా గజపతితోడఁ• బోరి రపుడు. 134

సీ. ఎను రైన రిపులోక • మెటుఁ బోవఁ గానీక
కఱకుఁ గత్తులచేత • నఱికి నఱికి
చేతి కందిన యెట్టి • సేనానినేఁ బట్టి
శితఖడ్గవితతిచేఁ • జీల్చి చీల్చి
పై బడఁగా వచ్చు • పగతురఁ గని హెచ్చు
క్రోధంబుచే నసిఁ • గ్రుచ్చి గ్రుచ్చి
నిలచి పోరెడి మేటి•బలియురఁ దమ యీటె
మొనలచేఁ బలుమాఱుఁ • బొడచి పొడచి
తే. గీ. విపులశౌర్యాగ్నిసంగ్రామ•భీము లగుచుఁ
జెలఁగి శ్రీకృష్ణరాయని • సేన లపుడు
గజపతీంద్రుని సేనలఁ • గలచి రొకట
విజయకాంక్షచే నుప్పొంగి • విజయు భంగి. 135

క. అటులన్ బోరుచు నుండఁగఁ
జటులార్తివ్రజము సరభ•సంబున నేతెం
చుటఁ గాంచి కృష్ణరాయం
డిట నొక సామంతరాజు • నీక్షించి యనెన్. 136

పంచచామరము. బలే బలే యటంచు మెచ్చ•వచ్చు శౌర్యమొప్పను
తత్కళేశు సైనికుల్ రణోర్వి • దారుణార్భటిన్ సము
జ్జ్వలప్రతాపవహ్నిఁ జూప • వచ్చుచుండి రల్లదే
పలాశరాజి యట్ల వాఁడి • బాహుగర్వమెట్టిదో.

ఉత్సాహ. అనఁగ నాతఁ డిట్టు లనె నృ•పాధినాథ సంగరం
బునఁ ద్వదీయశౌర్య మెల్ల • ము న్నెఱుంగమీ మనం
బున జయాభిలాష చేతఁ • బొంగుచున్ బదే పదే
యనికి వత్తు రంతనే జ•యంబు నొంద నేర్తురే. 138

చ॥ అనవుడు మోమునందు దర•హాసవిలాస మొకింత దోఁప నా
మనుజపతీంద్రుఁ డింకఁ గను•మా యనుమానము మాని మాదుక
ప్రణుతపరాక్రమంబున క•రాతివితానము భీతి సెంద నే
నని మొన నిల్పి పోరెద న • టంచు వచించి రణాంచితోద్ధతిన్. 139

క. సేనల సేనానుల నా
మానవపతి చేరఁ బిలచి • మంజులఫణితిన్
మానసముల నతులితశౌ
ర్యానల ముదయింప నిట్టు • లనియెన్ బ్రీతిన్. 140

ఉ. ఓ యసమానసాహసగు•ణోజ్జ్వలులార! పరాక్రమాఢ్యులా
రా! యుతంత్రభేదనస•మంచితధీనిధులార! ఓ చమూ
నాయకులార! సంతసము•నన్ జయలక్ష్మి వరించు నట్లు ల
త్యాయత శౌర్యధైర్యముల • నాహవకేళి యొనర్పుఁడీ వడిన్. 141

ఉ. వచ్చుచు నుండె నుత్కళనృ•పాలుని సైనికు లొక్కపెట్టునన్
హెచ్చిన బాహుగర్వమున • నెవ్విధి మీరలు పోర నేర్తురో
చచ్చుట తప్పదెప్పుడును జచ్చి•న జావఁగ నో రణావనిన్
వచ్చును దాన సద్యశము•వచ్చును స్వర్గము మెచ్చు లోకముల్ 142

క. అని యుత్సాహము గలుగఁగ
మనుజేశుఁడు వలికి సంభ్ర•మంబున ననికిన్
జని యె ల్లెడలను దా నై
కనుపట్టుచుఁ గడు విచిత్ర•గతులన్ బోరన్, 143

సీ. ఖండఖండంబు లై • కండల వెలిగ్రక్క-
చుండిన మొండెంబు • లొండుచోట
కొండబండలరీతిఁ • గూలి యుండిన మద
శుండాలతండంబు • లొండుచోట
కఱకుఁ గత్తులఁ దెగి • కదలఁ జాలక పడి
యుండిన యశ్వంబు • లొండుచోట
జలదరింపఁగ మేను • సెలయేరు లై పాఱు
నిండు నెత్తుటివాక • లొండుచోట
తే. గీ. నిప్పగిదిఁ గుప్పతెప్ప లై • యెల్లకడల
శాకినీఢాకినీభూత•చయము నటకు
నిండువేడ్క నాహ్వానింపు• చుండె ననఁగఁ
గరము బీభత్సముగ నుండెఁ • గదనభూమి. 144

సీ. అత్తఱిఁ జిత్తముల్ • దత్తరపా టొంద
భూరిగహ్వరములు • దూఱువారు
పిఱికి పందలరీతిఁ • జరణంబులకు బుద్ధిఁ
జెప్పుచు విపినాళిఁ • జేరువారు
రణభూమి నిల్చి సం•గ్రామం బొనర్ప నో
పక పడి వె న్నిచ్చి • పాఱువారు
పౌరుషంబునకు నై • పోరాడు చుండి వే
వేగ వీరస్వర్గ • మేగువారు

తే. గీ. గాఁగ రిపుకోటి విచ్చె నా•కసము నందుఁ
జూడ లేక మిత్రుం డబ్ధిఁ • జొచ్చె దిశల
శత్రుదుర్యశం బనఁ దమ•సంబు హెచ్చెఁ
గృష్ణవిభు జయలక్ష్మి మో•హించి వచ్చె. 145

తే. గీ. ఇటుల జయలక్ష్మిఁ గొంచు శ్రీ•కృష్ణరాయ
విభుఁడు సంగరోత్సుకుఁ డయి • విపులతేజ
మలర నాఁటికి సర్వసై•న్యములతోడఁ
గొంత విశ్రాంతిఁ గైకొని • యంత మఱల. 146

శా. ఊనత్రింశతివత్సరోల్లసితుఁ డై • యుగ్రప్రతాపాఢ్యుఁ డై
నానాశత్రువనీకుఠారుఁ డయి దీ•నవ్రాతసంరక్షదీ
క్షానూనాదరుఁ డేఁగుదెంచెఁ గటకేం•ద్రాఖర్వదోర్గర్వ మెం
తే నిర్మూల మొనర్చి తిమ్మరుసుమం•త్రీశున్ గనంగా నిటన్. 147

ఉ. ధూర్యతఁ గొండవీటిఘన•దుర్గమదుర్గము దాఁకి, యాకృపా
చార్యుఁడో, భీష్ముఁడో; మఱియు•శస్త్రగురుండగు ద్రోణుఁడో యనన్
శౌర్యము ధైర్యమున్ వరల • సంగరరంగమునందు నిల్చి, తి
మ్మార్యుఁడు పోరుచున్నవిధ • మద్భుతమై కనుపట్టె నాయెడన్ 148

తే. గీ. ఇటుల సాళ్వతిమ్మయసచి•వేంద్రుఁ డొక్క
ప్రక్కఁ బోరుచుండఁగఁ గృష్ణ•రాయఁ డొక్క
ప్రక్క పాత్రసామంతుల • పైని బడుచుఁ
గరముఁ జీకాకు పఱచె నా • తరుణమందు. 149

తే. గీ. గిరుల పోల్కి గతాసులై • కరులు వడియు
బ్రాణభీతిమై వెన్నిచ్చి • పాఱు వైరి
పథము లరికట్టి తమవారి•పాలు సేసి
చచ్చియును స్వామికార్యంబు • సలుపుచుండె. 150

తే. గీ. లసదలంకారములు లేక • లలితము లగు
నడకలును లేక తమచరణములు గొన్ని
కొఱత పడి యుండ విశ్రాంతి • గొనక, యట్టె
కూలెఁ గుకవికవిత వోలె • కొన్ని హరులు. 151

క. అరు లందు గొంద ఱతిశిత
శరము లురంబులను నాట • సత్వర మొప్పన్
ధరణిని బోరగిలం బడి
చిఱువుగ సాష్టాంగదండ • మిడుగతి నార్జన్. 152

తే. గీ. సాహసోత్సాహములతోడ • సమరభూమి
నిలచి పోరు తిమ్మామాత్యుఁ • గలయఁ జూచి
బళిబళీ యని శాత్రవ•వ్రజము గూడఁ
బ్రస్తుతింపఁగఁ బోరె నా • బాపనయ్య. 153

క. ఇటులన్ బోరఁగ నొకవడి
కెటుఁ జూచిన ముమ్మరముగ • నేతెంచిన యా
కటకాధీశ్వరు సేనా
పటలము మటుమాయమైన • భాతిన్ దోఁచెన్. 154

శా. అంతన్ ధీనుతకృష్ణరాయనరనా•థాగ్రేసరుం డెంతయున్
జింతాక్రాంతహృదంతరాళు లయి వా•సిన్ బాసి యా స్వీయదు
ర్గాంతర్భాగము నందు దాగుకొని య•త్యంతార్తులై యున్న సా
మంతాళిన్ జెఱవట్టి వాజిగజసం•పచ్ఛ్రేణితో నుద్ధతిన్. 155

సీ॥ ఘనతరశాలివా•హనశకాబ్దంబులు
పదునాల్గు నూర్ల ము•ప్పదియు నేడుఁ
జన యువవత్సరా•షాఢ శుద్ధైకాద
శీ స్థిరవారమై • చెలఁగునట్టి

పదునేను నూర్లపైఁ • బదునేను హయాణవ
త్సరముల జూను మాఁసమున నిరువ
దియు మూఁడు నైన తేఁదిని గొండవీటిదు
ర్గంబును శ్రీకృష్ణ•రాయవిభుఁడు

తే. గీ. తోడునీడ యై మంత్రి యా • దురము నందు
నిలచి పోర శాత్రవతతి • గలఁగి పాఱ
హర్ష మింపాఱ దిశల స•ద్యశము మీఱ
తనవశము జేసికొని యనం•తరమునందు. 156

సీ. అనిఁ జూపి నట్టి శౌ•ర్యమునకు మెచ్చి యి
చ్చెడి ఘనపారితో•షిక మనంగఁ
జదువుసంధ్యలు సెప్పి • సాకెఁ ద న్నని కాతు
కమున నిచ్చెడి గురు•కట్న మనఁగఁ
జిరకాలముగ మంత్రి•వరుఁడయి కొలువులోఁ
జేరియుంట నిడు జాఁగీ రనంగ
మున్ను మృత్యువు నుండి • తన్ను బ్రోచుట నెంచి
చూపు కృతజ్ఞతా•సూచక మన

తే. గీ. శ్రీకరునకు సాళ్వాన్వయ•శేఖరునకు
తిమ్మయామాత్యమణికి స•త్కీర్తిఘృణికి
నిండుమోదముతో నాఁడు • కొండవీడు
కృష్ణదేవరాయ లొసంగె • నిం పెసంగ. 157

క. అంతట సేనలతో భూ
కాంతుఁడు పుణ్యస్థలములఁ • గాంచుచు మఱియున్
సంతతవిజయోత్సాహ
స్వాంతంబున రిపులఁ దఱుమ • నరుగుచు నుండెన్. 158

తే. గీ. తిమ్మమంత్రియుఁ దనకు స్వా•ధీన మైన
కొండవీటిని నాదెళ్ల • గోపమంత్రి
వశముఁ జేసి రణోత్సాహ•వశము చేత
శీఘ్రగతిఁ గృష్ణరాయలఁ • జేరికొనియె. 159

సీ. అంత నిర్వీరు మేదు. • రాడంబరముగఁ
జనుదెంచి కొండప•ల్లిని గలంచి
గౌతమీకృష్ణవే•ణీతటమధ్యస్థ
వేఁగిదేశంబును • వికల పఱచి
రాజమహేంద్రవ•రము దాఁకి పోట్నూరి
కడ జయస్తంభంబు • గ్రాల నిలిపి
మాడుగు లాదిగ • మన్యసీమలను వ
డ్డాదిని గెల్చి యా • మీఁద సింహ

తే. గీ. శైలనికటమం దొక జయ• స్తంభ ముంచి
శౌర్య మెసగంగ యుత్కళే•శ్వరుని రాజ్య
మును ప్రవేశించి తత్ప్రాంత•వనమునందు
దండు విడిసె శ్రీకృష్ణరా•డ్ధరణివిభుఁడు. 160

ఇది

గద్య:—శ్రీవిరాడ్విశ్వకర్మ వంశసంజాత, శ్రీరామయ్యదుగ్ధపయోధి
సుధాకరాంగిరసగోత్రపవిత్ర, గంగయాచార్యపుత్ర,
సుబ్బమాంబాగర్భశుక్తిముక్తాఫల, శ్రీశ్యామలాంబ
పాదారవిందమకరందాస్వాదసానందహృదయేం
దిందిర, వీరబ్రహ్మాహ్వయ ప్రణీతం
బైన 'తుఖారామ్' నామక
ప్రబంధము నందలి
ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# తుకారామ్.

## ద్వితీయాశ్వాసము.

తే. గీ. అటులఁ జనుదెంచి కటకపు • రాంతికమున
సకలదండనాయకచమూ • నికరమునకు
నాప్తవర్గంబునకు నమా • త్యాళి కచటఁ
దగిన వసతుల నెలకొల్పి • తనరుచుండె. 1

ఉ. బారులు దీర్చి కట్టి రొక • వంకఁ జమూతతికిన్ గుడారముల్
భూరితురంగశాల లొక • మ్రోలను నిల్పిరి హస్తికోటికిన్
సారమహీరుహాంగణవి • శాలతరావనిఁ బాదుకొల్పి పృ
థ్వీరమణుండు నిల్వఁ గడు • వింతగఁ దచ్ఛిబిరాంతరంబునన్. 2

క. లీలాగృహము రహ
స్యాలోచనగృహము భోజ • నాసనశయ్యా
కేళీగృహములు రమ్యవి
శాలసభాస్థలము లమరు • సరణిని వేడ్కన్. 3

క. నెలకొల్పి రందుఁ జక్కని
వెలిపట్టుగుడారములను • వీనికిఁ జుట్టున్
నిలిపిరి నెలవులు సచివా
దులకు నమాత్యాగ్రణికిని • దోరము గాఁగన్. 4

ఆ. వె. అలరు చుండెఁ గొంచె • మావల వీనికి
సైనికవ్రజంబు • సంతతంబు
సాధకంబు బొనర్పఁ • జను సాము గరిడీలు
దమ నివాస మందుఁ • దనరు నట్లు. 5

ఉ. వెండియు నాల్గువైపులకు • వీనులు నంగడులుల్ జెలంగ నెం
డుండియె నద్భుతం బడర • నొక్క మహానగరంబు వచ్చి యీ
దండను వ్రాలెనో యనఁగఁ • దద్దయుఁ దచ్చిబిరంబు వొల్చె ను
ద్దండుఁడు కృష్ణరాయవసు•ధావరు డంచు భయంపడన్ రిపుల్. 6

ఉ. ఈవిధి దండు నాపి కట•కేశ్వరు రాజ్యమునందుఁ గల్గు నా
నావిధవాజివారణర•ణప్రథితోరుచమూవ్రజంబు నా
భూవిభురాజ్యతంత్రమును • బూర్ణముగా గ్రహియించి రా మహా
ధీవిభవాఢ్యులున్ విపుల•ధీరమనస్కులు నైన చారులన్. 7

క. కని కృష్ణరాయభూవిభుఁ
డనియె మహానిపుణమతుల • రై మీ రిపు డా
మనుజేశు నగరమునకున్
జని యందలి వార్త లెఱిఁగి• సత్వర మొప్పన్. 8

క. వినిపింపవలయు మా కన
జనపతి యానతిని మౌళి • సంధించి వడిన్
చని యిరువురు చారులు ద
త్క్షణమ కటకపురికి నిటులఁ • జని తత్పురిలోన్. 9

చ. ఇతరు లెఱుంగ కుండఁ బుర • మెల్ల వణిగ్వరవేషధారులై
చతురత రాజవీథులను • సందుల గొందుల నేఁగు చుండి త
త్క్షితిపతిరాజ్యమర్మము ల•శేష మెఱుంగుచుఁ గాంచి రొక్క నాఁ
డతులతనూవిలాసలల•నాకృతి మించు పటంబు నొక్కెడన్. 10

ఉ. అంతఁ దదీయచిత్రపట • మందు విరాజిలు మోహనాకృతిన్
సంతస మొప్పఁ గాంచి తమ • స్వాంతములం దిటు లెన్నసాగి రీ
కాంత దలంపఁగా మనుజ • కాంత యనన్ దగునెట్లు? దేవతా
కాంతయొ కానిచో ఖచర • కాంతయొ కంతునికాంతయో భళీ. 11

క. అటుగాక చిత్రకారుని
పటుతరధీవిభవ మొక్కొ • భావింపఁగ నె
చ్చట నైన నిట్టి మానవ
కుటిలాలక గలదె యరయఁ • గుంభిని లోనన్. 12

తే. గీ. అంచుఁ దమలోనఁ దాము త • ర్కించుకొనుచుఁ
జిత్రపట మున్న గేస్తుని • జేరి యనిరి
స్వామి యీచిత్రితాకార • వైభవంబుఁ
గాంచి మించు చంచలనేత్ర • గలదె ధాత్రి. 13

చ. అనవుడు మోమునందు దర • హాసవిలాస మొకింత దోఁప నో
వణిజవరేణ్యులార! మము • పాలనముం బొనరించు చున్న మా
మనుజపతీంద్రు పుత్రి యస • మానమనోహరగాత్రి యొక్కెడన్
ఘన మగు రొక్క మిచ్చి కొనఁ • గల్గితి దీని మహాప్రయాసచేన్. 14

కం. పరు లెఱుఁగ కుండఁ గొని నే
పరమరహస్యముగఁ బదిల • పఱిచితి నన నా
పురుషుఁ గని వేషధారులు
సరగున ని ట్లనిరి మిగుల • సంతస మొలయన్. 15

ఉ. ఓసుగుణాఢ్య! యీ నవవ • యోవిభవోల్లసితాంగనామణీ
భాసురచిత్రరూపపట • వైభవమున్ దిలకించి నంత ను
ల్లాసముచేత మాకు సక • లంబును విస్మృతి యయ్యె నింక మీ
రే సరణిన్ మదీయహృద • యేప్సితముల్ నెఱవేర్తురో దయన్. 16

ఉ. ఎన్నిదినంబు లీ వారుల • దృష్టిపథంబును జెందకుండ రా
కన్నె పటంబు దాఁచెదవు • కావునఁ జెప్పుమ దాని మూల్య మో
సన్నుతశీల! యిబ్బడి యొ•సంగి వడిన్ జనువార మయ్య మీ
కెన్నడు రాదు నేఁగి యిట • కెంతయు దూరము మాపురం బనన్.

చ. అతఁడును వల్లె యంచుఁ దగు • నర్థముఁ గైకొని తత్పటం బిడన్
మతిఁ గుతుకంబు నొంది పుర•మర్మము సైన్యవిశేష మాహవ
స్థితిగతిఁ గ్రమ్మఱన్ దెలియఁ • జెచ్చెర నచ్చొటు వాసి యేఁగి యం
దతులరణప్రయత్నముల • నారసి యారసికుల్ రయంబునన్. 18

క. చని తమ శిబిరంబుల కం
దనిశమహోత్కంఠమతిఁ ద•దాగమనవిలో
కనకౌతూహలు డగుఁ దమ
జనపతిఁ గని పలికి రిటుల • సవినయ మొప్పన్, 19

ఉ. ఓనరపాలచంద్ర! సుగు•ణోజ్జ్వలనిర్మలకీర్తిసాంద్ర! మీ
యానతి మూళ్ళి దాల్చి కట•కాధిపు బత్తన మెల్లఁ గాంచి యం
తేని రహస్యవృత్తి గ్రహిం•యించిన వార్తలఁ జిత్తగింపుఁ డ
వ్వాని పరాక్రమోద్ధతియు • వాని మహాప్రతిభావిశేషమున్. 20

క. స్తుతిపాత్ర మయ్యె మాకును
దతభూరిశిలావినిర్మి•తప్రాకారా
వృతదుర్గమదుర్గము ల
ద్భుతరీతిని బరిఢవిల్లె • భూపవరేణ్యా. 21

సీ. తతమదద్రవపాన•తత్పరాగతమధు
కరులు గల్గిన మద•కరుల బలము
నిజగమనోద్ధతి • నిర్జితవనకురం
గములు గల్గిన తురం•గముల బలము

విపులరౌద్రాకార • విజితాంతకభటప్ర
వరులు గల్గిన యోధ • వరుల బలము
నిరుపమమతి నిరం • తరతిరస్కృతబృహ
స్పతిని గల్గిన చమూ • పతుల బలము
గీ. దుర్గమంబైన ఘనశిలా • దుర్గబలము
నిట్టి వెల్లఁ గల్గియునామ • హీవిభుండు
భవదనూనవిక్రమకళా • వైభవంబు
దలచి నిరతంబు లోలోన • నులుకు చుండు. 22

క. కావున సర్వము నాథా
శ్రీవిభుఁడు స్వయంబుగాఁ బ • రీక్షించుచు భీ
తావహరణసన్నాహము
గావించుచు నుండె భూప! • కడు మెలకువతోఁ. 23

ఉ. ఓనరపాలచంద్ర! కట • కోర్వి వణిగ్వరవేష మూని, మీ
యానతిమై రహస్యవిష • యంబుల నెల్ల నెఱింగి వచ్చుచో
నీ నవమోహనాకృతి వ • హించిన చిత్రపటంబు గంటి మీ
మానితమూర్తి యా ప్రభుకు • మారినిజాకృతి యంట భూవరా. 24

గీ. ఇట్టి సుందరాకృతి భువి • నెందు లేని
కతనఁ గొనివచ్చినార మో • క్ష్మాతలేశ!
చిత్తగింపుఁ డటంచు నా • చిత్తరువును
విభున కొసఁగి పీడ్కొనిరి యా • వేఁగువాండ్రు. 25

మ. ధరణీపాలకవర్యుఁ డాలిఖితకాం • తాకారముం గాంచిని
ర్భరహర్షాంబుధిఁ దేలి సంచలితహృ • త్పంకేరుహుండై తదీ
యరహస్యంబును లోన డాఁచికొని స్వీ • యామాత్యు నీక్షించి సం
గరవృత్తాంతము వింటివే గడ యిఁకన్ • గర్తవ్య మూహింపుమా.

ఆ. వె. అనుచుఁ గార్యభార • మంతయుఁ దిమ్మరు
సయ్య పైనఁ బెట్టి • యవనినాథుఁ
డాపటంబుతోడ • నభ్యంతరగృహంబు
హర్షపులకితాంగుఁ•డగుచుఁ జొచ్చె. 27

చ. గుములయి తేనిచిత్తమునఁ • గోరిక లీరిక లెత్తుచుండి దీ
ర్ఘము లగుచున్న చందమునఁ • గాంచగఁ నల్గడ లందు నీడ లా
సమయమునన్ దిశావళికి • సాఁగుచు నిక్కుచు నీల్గుచుండె నా
క్రమముగ మధ్యకాలమునఁ • గల్మి లభించిన యల్పు కైవడిన్. 28

ఉ. భృంగవరేణ్యుఁ డొక్కఁ డవి•వేకమునన్ మును పొక్కసారి తా
భంగము నొంది యుండుటను • భావమునన్ దలపోసి పద్మినీ
సంగతి వీడఁజాలక వి•చారముతోఁ జను చుండె నారథా
త్రిం గన భోగ్యవస్తు•వితతిన్ గల మోహామహత్వ మెట్టిదో. 29

మ. అల భూపాలకబాలరూపగుణవి•ద్యాభోగసౌశీల్యముల్
దెలియన్ స్వీయమనోజ్ఞకంఠరవముల్ • దీపింపఁగాఁ గృష్ణరా
యల మ్రోలన్ వివరింప వచ్చుగతి ను•ద్యల్లీలఁ బక్షివ్రజం
బులు వృక్షావళిఁ జేరు చుండె మిగులన్ • మొత్తంబులై కూయుచున్.

సీ, యామినీకాంత నీ•లాంబరంబున సొరు
బొలుపారు జలతారు • పూవు లనఁగ
స్వామితీక్ష్ణతకోడి • సానఁ బెట్టింపంగ
నప్పుడు రాలిన సూర్య • నలుసు లనఁగ
అంతరక్షశ్రీల•తాంగిపాదాంభోజ
కమనీయనఖకోర•కంబు లనఁగ
నిజనాథుఁ గని శోభి•ణీసతి విడచు నా
నందాశ్రుబిందుబృం•దం బనంగ

గీ. గగనవీథుల నిర్మల• కాంతు లొలయ
వెల్లివిరిసెఁ జుక్కలు విను•వీథి నెల్ల
నంగభవమహా•సంగర•రంగ మందు
ద్రుటితకామినీహారమౌ• క్తికము లటుల. 31

సీ. ఆత్మీయదర్శనో•త్సాహ యా కుముదినీ
కాంత కొక్కింత గి•ల్గింత వెట్టి
భ్రమర మంటని పూవు • పగిది నుండిన జవ్వ
నుల నవమోహ మ•గ్గలము సేసి
లీలావిహారవి•లోలు రై చరియించు
తారుణ్యవతుల కు•త్సవము గూర్చి
జారచోరాదిదు•ర్జనరహస్యోద్యమం
బుల కంతరాయముల్ • గలుగఁ జేసి

గీ. ప్రాగ్దిశాసతీహ స్తద•ర్పణ మనంగ
సకలసజ్జనకీ ర్తిచం•ద్రిక లనంగ
నతులనిర్మలధవళదీ•ధితులు వెలయ
శీతకిరణుఁ డత్తఱి విభా•సిల్లు చుండె.

గీ. రేలు క్షణ మట్ల దంపతుల్ • ప్రీతి సలుపు
సరససల్లాపచాతుర్య•గరిమ గాంచి
యుల్లములఁ గడు మెచ్చుచు • నున్నరీతి
దీపకళికలు దమ తల • లూపఁ దొడఁగె. 33

క. వీఁచెను జల్లని గాడ్పులు
దోఁచెను గమలాప్తు డంత • దూరుపు గొండన్
పూచిన తామరపూవులఁ
జూచుచుఁ దుమ్మెదలు సేరె • ఝంఝ మ్మనుచున్. 34

ఉ. ఈవిధిఁ దెల్లవాఱుట మ•హీశుఁ డెఱుంగునొ లేదొ కాని యా
భూవిభుపుత్త్రిరూపపట•మున్ దిలకింపుచు మాటిమాటికిన్
భావపరంపరల్ సెలఁగ • బంధురవర్ణనలన్ రచింపుచున్
భావజు ప్రేరణంబున మ•నంబున నన్య మెఱుంగఁ డత్తఱిన్. 35

మ. తల పంకించు నొకింత మెచ్చుఁ దన యా•త్మన్ సృష్టిచిత్రంబు లీ
యలరుంబోడిని బోలు చేడెలు జగం • బం దుందురే యంచు దాఁ
దలఁచున్ సత్కవు లైన నీచెలువ సౌం•దర్యంబు వర్ణింపఁగాఁ
గలరే యం చెద నెంచు ముద్దు లిడఁగా • గాంక్షించు లోలాత్ముఁ డై.

సీ. మోమును దిలకించి • మురియు చుందునె కాని
సరససల్లాపముల్ • సలుపు టెట్లు?
కలువఱేకులఁ బోలు • కనులఁ గాంచుదుఁ గాని
నోరార ముద్దాడ • నోఁచు టెట్లు?
స్తనభారమునఁ గ్రుంగు • తనువు మెచ్చుదుఁ గాని
కౌఁగిట గదియింపఁ • గలుగు టెట్లు?
అతివ జవ్వనపు సో•యగముఁ జూచుదుఁ గాని
పడతి సంగాతంబుఁ • బడయు టెట్లు?

తే. గీ. చిత్రపటముఁ జూచుచు నేను • జిత్రపటము
కరణి నగు చుంటిఁ గాని యీ • కలికిమిన్న
నాదు సరసఁ జేరంగ నా•నంద మందు
భాగ్య మది యెట్లు నాకు సం•ప్రాప్త మగును? 37

తే. గీ. అనుచు నొకపరి నది పట • మనెడి తలఁపు
వీడి యేమేమొ సల్లాప • మాడఁ బోవుఁ
బిదప సత్య మెఱింగి లో • వ్రీడఁ దోఁప
నితరు లెఱిఁగిరో యని యటు • నిటును జూచు. 38

ఉ. ఎంతటి జాణవే యొక మ•హీవరు సత్కవిలోకగేయు నా
యంతటివాని నీపగిది • నద్దిరె చంచలచిత్తుఁ జేసి వి
భ్రాంతి ఘటించి తౌ జగతిఁ • బంకజనేత్ర లపాంగపాళిచే
నెంతటివారి నైనను జ•యించెద రందురు సత్య మయ్యెడిన్. 39

క. మానవకల్పిత మగు నీ
మానితపటమున నె నిల్చి • మామకమన మీ
మానిని గొనెఁ గద యిఁక నా
చాన సమక్షమున నెట్టి • సంతస మిడునో. 40

గీ. అనుచుఁ బహువిధగతుల నా • యవనివిభుఁడు
చిత్తజాశుగతతికి వ•శీకృతుండు
గాఁగఁ గూర్కెఱుంగక రేయి • గడపెఁ గాని
తెల్లవాఱుటయును మదిఁ • దెలియఁ డయ్యె. 41

ఆ. వె. అంత వింతగాదె • నరుణోదయమునకు
మున్నె నిద్ర లేచు • భూవిభుండు
నేఁడు శయనగృహము • వీడి రాఁ డేలకో
తడవు సేసెఁ బ్రొద్దు • వొడచి యున్న. 42

గీ. అనుచు సామంతనృపులు సై•న్యాధిపతులు
దక్కుగలవారు లోలోనఁ • బెక్కుగతుల
నరయు చుండంగఁ దిమ్మరు • సరుగుదెంచి
యల్ల నల్లన శయనగృ•హంబు డాసె. 43

చ. చనువు మెయిన్ నృపాలకుని • సన్నిధి కేఁగిన యంతఁ బాన్పుపైఁ
గనుఁగొనెఁ జిత్రలేఖన మొ•కం డది చారు లొసంగి నట్టి దం
చను గటకేశపుత్రి యను•చున్ మనుజేశ్వరుఁ డాలతాంగిపై
మనసును నిల్పె నంచు క్షణ•మాత్రములో గ్రహియించె సర్వమున్.

ఉ. ఆగతి వచ్చి చెంతఁ గల • యాసనమం దుపవిష్టుఁ డై తదీ
యాగమనంబుఁ గాంచి హృద•యస్థరహస్యము దాపఁ జూచు నా
భోగపురందరుల్ సచివ•ముఖ్యుఁడు లే నగ వొప్ప నిట్లనున్
దాగునె మీ కృపార్హుకడ • దాపఱికం బది యేల భూవరా. 45

ఉ. ఇప్పుడమీశుపుత్రి వరి•యించెద రేని శుభస్యశీఘ్ర మం
చిప్పుడె కార్యసాధనము • నెల్ల నొనర్చెద నా నృపాలుఁడే
తప్పక వచ్చి తాఁ దన సు•తన్ దమ కిచ్చు ముదంబు దెల్పెడిన్
గొప్పదనంబు గాదె తన•కుం దమ రల్లురుగా లభించుటల్. 46

గీ. అదియుఁ గాక మహాపాత్రు • లనెడివారు
వీరవరులు పదార్గురు • వీనితోడఁ
జేరి యుండిరి మనసేన • దూర మరుగు
దెంచి కడు డస్సి యుండెను • ధృతి దొలంగి. 47

క. ఏవగఁ జూచిన నని కిది
భూవర! సమయంబు గాదు • బుద్ధిఁ దలంపన్
గావున భేదోపాయము
చే వీని జయించు టొండె • శ్రేయం బనినన్. 48

క. ఎప్పుగిదిఁ జెప్పుదువో నీ
వప్పుగిది ఘటింప నేర్తు • నైనను నేఁడో
యప్పాజి! సమరయత్నము
దప్పునె? నృపుఁ డొప్పుకొనునె • తనయ నొసంగన్. 49

చ. అన విని బాపనయ్య దర•హాసవిలాసము గొంత దోఁప భూ
పుని గని మానవావళికి • బుద్ధిబలంబునఁ గాని కార్యముల్
జనవర! యుండునే? యనుచు • సత్వర మచ్చొటుఁ బాసి వచ్చి మం
తనమునఁ గొంత యోచన నొ•నర్చి వడిన్ లిఖియించె నీగతిన్. 50

సీ. శ్రీమన్మహాసార్వ•భౌమకర్ణాటరా
జ్యాధీశకృష్ణరా•యప్రభుండు
పదునార్వు రగు మహా•పాత్రముఖ్యులకు నిం
పెసఁగ లిఖించు న • దే మనంగ
మీరు కోరిన రీతి • మేటిరత్నాభర
ణాంబరాదు లొసంగ • ననుమతించి
యీ బహుమానంబు • లిపు డంపు చుండె మీ
రలు పేరునకు రణ•రంగమునకు
తే. గీ. వచ్చి గజపతీంద్రుని బట్టి • యిచ్చు నంతఁ
దక్కఁగల బహుమానముల్ • దప్ప కుండ
సంతసంబున మీకు నొ•సంగఁ గలము
వేగ మీ సెప్పినట్లు గా•వింపుఁ డింక. 51
తే. గీ. అనుచుఁ బదునార్వురకు లేఖ•లను లిఖించి
రత్నభూషాంబరములతో • రమ్య మైన
పేటికల నుంచి గజపతి • వీటఁ దిరుగ
నంపెఁ దగువారి కొసఁగి తి•మ్మయ్యమంత్రి, 52
క. పదునాఱు మందసములను
పదునార్వురు వెంటఁ గొనుచుఁ • బాత్రులకొఱకై
వెదకుగతి గజపతీంద్రుని
సదనముఃకడఁ దిరుగు చున్న • సమయము నందుఁ. 53
గీ. కొందఱా కటకాధీశు • గూఢచారు
లీరలను గని మది సంశ•యించి తమ నృ
పాలు కడకుఁ గొంపోవ నా • పార్థివుండు
గాంచె సర్వంబు నా పేటి•కలను దెఱచి. 54

సీ. విభ్రమహర్మ్యముల్ • బెనగొన మణిమయాం
చితభూషణములు వీక్షించి యందుఁ
గల లేఖలఁ బఠించి • కపట మెఱుఁగలేక
తగునె యింతటి కుత్సితం బటంచు
నాకు బాసట వచ్చి • నను బట్టి యీయంగ
నిశ్చయించిరె పాత్రనీచు లకట
యిట్టి స్వామిద్రోహ • మెప్పు డైన నెం దైన
విని కని యుంటిమె • విశ్వ మందు

తే. గీ. కంచియే చేను మేయంగఁ • గాపి కేమి
చేయఁ గలఁ డంచు మది చాలఁ • జింతఁ బూని
చేయునది లేక యెవరితోఁ • జెప్ప లేక
శీఘ్రమ పలాయనుం డయ్యె • క్షితివరుండు. 55

ఆ. వె. రాజు లేని యట్టి • రాజ్య మేగతి నిల్వఁ
గల దటంచు మదిని • దలఁచి యపుడె
పయన మయిరి తాము • వచ్చిన దారిని
క్షాత్రవరులు నితర • పార్థివులును. 56

క. ఇటుల నిరాఘాటంబుగఁ
గటకేశ్వరు పత్తనమునఁ • గర్ణాటచమూ
పటలి సొర సులభమార్గము
ఘటియిల్లె నమాత్యబుద్ధి • కౌశల్యముచే. 57

ఉ. ఎప్పటివార్త లప్పుడు గ్రహింపుచుఁ గృష్ణవిభుండు దక్షిణం
బవ్వరి దండుతో వెడలి • యాత్మగతంబునఁ జింతసేసె ని
ట్లెప్పుడమీశు మోసమున • నీగతి బాఱఁగఁద్రోలు టెంతయుఁ
గొప్పదనంబె క్షాత్రమునకుం దగునే భువిఁ గుత్సితక్రియల్. 58

ఉ. కావున వానిరాజ్యమును • గ్రమ్మఱ వాని కొసంగు టొప్పు నం చా
విధ మెల్లఁ దిమ్మసచి•వాగ్రణికిన్ వివరింప నాతఁ డో
భూవర! సర్వమున్ శుభము • పొల్పెసలార నొనర్తు నేన మో
దావహ మయ్యెడిన్ దమకు • నంచు నతండు వచించి తేనితో. 59

మ. రణరంగంబున నిల్వ నోటువడి పా•జిం జూచు నెవ్వాని నై
నను మా భూపు డెదుర్కొనం జనఁడు గా• నన్ భీతి వోనాడి మీ
కనుకూలం బగు సంధి నేసికొని రా•జ్యం బెప్ప ట ట్లేలుకొ
మ్మనుచున్ బత్రిక వ్రాసి యొక్కరునిచే • నంపెన్ బురిన్ జాటఁగాన్.

తే. గీ. అతఁ డట్లాజ్ఞఁ గొని రాజ•హర్మ్యసీమ
నిలచి కటకభూవరు నమా•త్యులును హితులు
బంధుజనులును విను నట్లు • ప్రకటనంబు
పొనరిచెను దిమ్మమంత్రీశు • ముదల యనుచు. 61

ఉ. ఎల్లరు నీ సువార్త విని • యెట్టి యుదారగుణాకరుం డహో
చెల్లరె యిట్టిక్షాత్రగుణ•శేఖరుఁ గంటిమె యెందు నైన రం
జిల్లెడు నుల్ల మీ నృపు సు•శీలముఁ జూడఁగ నంచుఁ గృష్ణభూ
వల్లభు కీర్తిచంద్రికల• వర్ణన సేయఁగ బూనిరయ్యెడన్. 62

తే. గీ. చారముఖమున నీసమా• చారమరయు
చున్న గజపతి తలపోయు • చుండె మదిని
నిట్టి సద్గుణోదారున • కేవిధంబ
నేఁ గృతజ్ఞతఁ జూపంగ • నేర్తు మఱియు.

క. సులభవశీకృతరాజ్యము
నిల ధార్మికబుద్ధి నే మ•హీశుఁడు విడువఁన్
దలకొను నరెరే యీ రా
కులతిలకుఁ బ్రశంస సేయఁ • గూడదె కరమున్. 64

ఉ. చిత్రము గాదె నేను గుణ•శీలు రటంచును నమ్మికొన్న యీ
పాత్రు లపాత్రులై కుపథ•వర్తను లౌటయు రాజ్యలోలుఁడౌ
శత్రునృపాలుఁ డీ సరణి • క్షత్రియధర్మము నెంచి కోవిద
స్తోత్రచరిత్రుఁడై కరుణఁ • జూడఁగ నుంటయు నెంచి చూడఁగన్. 65

తే. గీ. కాన నీయుదారునకు నే • కాన్క యొసఁగి
సంధి గావించుకొని సంత•సంబు గందు?
ననుచు నరసి యా కటకేశుఁ • డాత్మజాత
యగు తుకారాము వర్పింప • నాత్మ నెంచి. 66

సీ. తనయాప్తవర్యు నొ•క్కనిఁ జేరఁబిలచి యి
ట్లనియె విందువు గాదె • యానృపాలు
ఘనతరౌదార్యంబు • కరుణాతిరేకంబు
సదమలశీలంబు, సద్గుణంబు
క్షాత్రగుణము నెంచి • సమధిక రాజ్యంబు
హస్తగతం బైన • యట్టిదాని
తృణతుల్యముగ మది • నెంచి యీసరణి సం
ధికిఁ దాన పంపె సం•దేశ మహహ

తే. గీ. ఇట్టి సార్వభౌముని నెయ్య • మెట్టు లైన
సంభవిల్లుట మన యదృ•ష్టంబు గాదె
కాన మత్కుమారికఁ గాన్కఁ • గా నొసంగి
యల్లునిగఁ జేసికొనఁగ నే • నభిలపింతు. 67

క. శ్రీకృష్ణదేవరాయల
కీ కోర్కె నెఱుంగఁ జేసి • యేగతి నైనన్
నీకౌశల్యం బేర్పడఁ
జేకొని రమ్మా శుభంబు • శీఘ్రముగా గన్. 68

క. అని పంచిన నాతం డా
క్షణమ యరిగి కృష్ణరాయ • సచివాగ్రణి యా
ఘనమతి తిమ్మయమంత్రికి
వినిపించెఁ గజపతీంద్రు • విన్నప మంతన్. 69

క. తిమ్మయమంత్రియుఁ గడువా
క్షమ్మున నావార్త దనదు • ప్రభునకుఁ దెలుపన్
సమ్మతిఁ గొని లోనికిఁ జని
యిమ్ముగ వచియించె నతఁడు • నృపునకు నంతన్. 70

చ. నయనయుగంబు సంతసిల • నాతిఁ బటంబునఁ గాంచు సంతతం
బయినను దాఁ దదీయలలి • తాంగి జగన్నుతమోహనాకృతిన్
స్వయముగఁ జూడఁ గోరి తన • భావము మంత్రి కెఱుంగఁ జేయఁ ది
మ్మయయు మహాప్రసాదమని • యాదలఁ దాల్చి కృతప్రయత్నుఁడై.

ఉ. మానితధర్మచేలముల • మంజులరత్నవిభూషణంబులన్
గానుకఁ బెట్టి వానిఁ గడు • గౌరవమున్ బొనరించి యిట్లనెన్
మానవపాలమౌళి దమ • క్ష్మావిభుఁ డంపిన వార్త కెంతయున్
దా ననుకూలుఁ డయ్యె నిఁకఁ • దద్దయు లగ్నము నిశ్చయింపుఁడీ. 72

తే. గీ. మఱియు భావికర్ణాటసా • మ్రాజ్యలక్ష్మి
గాఁగ నున్నట్టి మాతల్లిఁ • గాంచు కోర్కె
గలుగుచున్నది కాన మీ • క్ష్మావిభునకుఁ
దెలిపి శుభవార్త నంపుమో • ధీవరేణ్య. 73

ఆ. వె. మంత్రి నోటఁ గాదు • మఱియు గుఱుఁడ నోటఁ
దండ్రిపోల్కెఁ గాంచు • ధరణివిభుఁడు
గానఁ బెండ్లికూఁతుఁ • గాంచి రమ్మని యాజ్ఞ
మా ప్రభుం డొసంగె • మాన్యచరిత! 74

చ. అన విని వల్లె యంచుఁ గట • కాధిపమంత్రివరుండు సత్వరన్
జని జనపాలుఁ గాంచి తన • సంతసమున్ వెలిఁ బుచ్చి యి ట్లనున్
ఘనుఁడగు కృష్ణరాయజన • కాంతుఁడె యల్లుఁడుగా లభించు నేన్
బొనరగఁ బూర్వజన్మకృత • పుణ్యఫలం బని పల్కె రాదొకో. 75

ఉ. ఏ మని చెప్పవచ్చు భళి • రే వినుఁ డాన్నృపమౌళివై భవం
బామహనీయ వత్సలత • యాకరుణార్ద్రకటాక్షవీక్షణా
శ్రీమిళితాస్యపద్మము వ • చింపఁగఁ జాల నుదారభావమున్
ధీమహిమాతిరేకము సు • ధీజనవంద్యము నిశ్చయంబుగన్. 76

సీ. తమ యల్లుఁ డౌట యెం • తయు భాగ్య మంచుఁ గ
ర్ణాటభూపాలుఁ డా • నంద మంది
యుద్వాహమునకు శు • భోత్కృష్ట మైన ల
గ్నంబు నిశ్చయము నొ • నర్పు డంచు
నసమానజాంబూన • దాభరణానూన
గౌరవతతి నుడు • గర యొసంగి
విబుధసమ్మతిమెయి • విపులాదరంబు గా
వించి యావిభుఁడు నన్ • వీడుకొలిపె

ఆ. వె. నట్టి యవసరమున • నవ్విభుసచివుండు
తిమ్మయాఖ్యుఁ డమల • ధీవరుండు
గురువరుండు పెండ్లి • కూఁతుఁ జూడఁగ వచ్చు
ననిరి తావకాజ్ఞ • యైన యెడల. 77

క. అని విన్నవింప నుత్కళ
మనుజేశుఁడు హర్షజలధి • మగ్నాత్ముం డై
యనుమతిఁ బంపెను దిమ్మయ
ఘనునకుఁ దనతనయఁ గాంచఁ • గా నగు ననుచున్. 78

తే. గీ. వార్తఁ బంపి తాఁ దఖిలాప్త • వర్గమునకు
నాయుదంతంబు దెలుప స్వీ • యాత్మజుండె
సంశయవిషాదపూరిత • స్వాంతుఁ డగుచు
వినయ మలర ని ట్లనెఁ దన • జనకు తోడ. 79

సీ. శ్రీరస్తు తతజగ • జ్జేగీయమానసా
మ్రాజ్యపాలనలోల! • మాన్యశీల!
అమలగుణోపేత • యతులపూతక్షత్రి
యాన్వయోదాత్తాభాత మా • యాత్మజాత
నిష్కల్మషచరిత్ర • నిరుపమశుభగాత్ర
కోవిద స్తవనీయ • కులపవిత్ర
యగు తుఖారామక • న్యాలలామను నేఁడు
కరుణాతిరేకంబు • గడకుఁ ద్రోసి
తే. గీ కులవిహీనున కొకనికిఁ • గూర్ప నుంచె
వలయుచో రత్నభూషణ • వారణాశ్వ
వితతి నర్పించి సంధి గా • వింత్రు గాని
చూడ నిది యేటి సంధి వ • సుంధరేశ!. 80

క. ఎల్లరు దాసీసుతుఁ డని
కొల్లలుగాఁ దెలుపు చున్న • గుణహీనుని మా
యల్లునిగాఁ గొనెదె మహీ
వల్లభ! యీపాటి దలఁప • వలదే యనుచున్. 81

క. పరగు జనశ్రుతిచే నిజ
మరయఁగ తే కిటుల సత్క • ళాలంకృతునిన్
వర రాట్కులప్రసూతుని
నిరుపమసత్కీర్తియుతుని • నిందించె నొగిన్. 82

ఆ. వె. సాగి వారి తనయ • సతతశుభోదయ
సత్కులీన గుణని • చయనిధాన
అమలశీల యగుచు • నలరు నాగాంబకు
బళిరె యీదృశాప • వాద మగునె. 83

సీ. నరసింహదేవభూ • నాథాగ్రకీకళ
పుత్రత్రయం బందునఁ • బ్రథమభార్య
యైన తిప్పాంబికతో నొకనాఁడు నా
గాంబిక చతురంగ • మాడి యోడి
యాఱునెలలు నిర్ణ • యానుసారముగఁ జే
రునకు దాసిగఁ జరించిన కతాన
శత్రుకాననవీతి • హోత్రుఁ డౌ శ్రీకృష్ణ
రాయప్రతాపాగ్ని • ప్రబలు కతన
తే. గీ. ఇట్టి సత్క్షత్రియాన్వయు • నీర్ష్యచేతఁ
జేయునది లేక యితఁడు దా • సీసుతుఁ డని
ప్రచురపఱచిరి యది జల • భాండమధ్య
పతితతైలబిందువు వోలె • వ్యాప్త మయ్యె. 84

క. అది యెఱిఁగి యుత్కలేశుం
డెద సంశయ మింత లేక • కృతనిశ్చయుఁ డై
వదలక తను జేరి పదే
పదె వారింపంగఁ జూచు • వారల కనియెన్. 85

తే. గీ. దుర్నిరీక్ష్యప్రతాపుఁ డై • తోఁచు కృష్ణ
రాయసార్వభౌము పయి నీ • ర్ష్యను వహించి
యిట్టి యపవాదమును ఘటి • యించి రెవరొ
బుద్ధిమంతు లీయది నమ్మఁ • బోలు నెట్లు. 86

తే. గీ. మఱియు వాగ్దాన మయ్యెఁ గు•మారి నీయఁ
గాన నాపూన్కి కన్యథా • పూన కింక
నేఁగుఁ డేది యెట్లైన న•య్యెడిని మాట
దప్పఁగా నేను క్షత్రియో•త్తముఁడు జగతి. 87

ఉ. బందుగు లడ్డగించినను•బత్ని యసమ్మతిఁ జూపుచున్న మీ
రందఱు నేక మై విముఖు • లైనను దొల్తన మాట యిచ్చి దా
నిం దొలగింప నేనె యవ•నీపతి శుద్ధకులీనుఁ డంటకున్
సందియ ముండునే తిరుగఁ • జాలదు నాదగు జిహ్వ పొం డికన్. 88

మ. అనుచున్ సత్యపథానురక్తుఁ డయి క•ళ్యాణోద్యమోద్యుక్తుఁ డై
జననాథుం డుచితప్రయత్నముల నో•జన్ సల్పుచుండంగఁ ది
మ్మన పౌరోహితుఁ డంచు వేఱొకని సం•రంభంబునన్ వెంటఁ దో
డ్కొని యేతెంచెను బెండ్లికూఁతుఁగను గో•ర్కుల్ మీఱ వేవేగమే

క. వచ్చిన వారిని గజపతి
హెచ్చిన గౌరవముతోడ • నెదురేఁగి విడెం
బిచ్చి కొని తేరఁ గుశలపు
ముచ్చటలన్ జరిపి సచివ•ముఖ్యుం డనియెన్. 90

ఆ. వె. పెండ్లికూఁతుఁ గనిన•పిదపఁ బ్రధానంబు
సలుపు టొప్పు ననఁగ • జనవిభుండు
అనుమతించి వారి • నంతఃపురమునకు
ననిపె నొక్క కోమ•లాంగితోడ. 91

చ. చెలియ యొకర్తు వారలను • జెచ్చెర నాసనముల్ గొనుం డటం
చెలమి వచించి మాచెలి య•హీనమనోజ్ఞముఖేక్షణంబులన్
దలఁపు జనించెఁబో కన వృ•థా శ్రమ వచ్చితి రింతదూర మా
కలువలతేనిఁ గల్వలను • గాంచరొకో తమపట్టణంబునన్. 92

సీ. చంద్రబింబముఁ జూచి • జలరుహంబును జూచి
చూడంగ నేల మా • సుదతి మోము
మృదువల్లరులఁ గని • మెఱుపుఁ దీవెలఁ గని
కన నేల నింక మా• కలికిమేను
శుకరవంబుల విని • పికరవంబుల విని
విన నేల మఱల మా • వెలదిపలుకు
సారంగములఁ గాంచి • సరసిజంబులఁ గాంచి
కాంచ గనేల మా • కాంత కనుల
తే. గీ. ననుచుఁ దెల్పుఁడు లేనివ•ర్ణనలఁ జేసి
మెప్పు లొందఁ గవిత్వంబు • సెప్పఁ జాల
నైనఁ బ్రత్యక్షముగఁ జూడ • నభిలషింతు
రేని యిదె వచ్చుఁ చుండె మా • తేనితనయ. 93
తే. గీ. అనుచు నది యేగు నంత స•ర్వాంగభూష
భూషితాంగ తుఖారామ•పుష్పగంధి
యొక నఖమణి కై దండ • యొసఁగి దండ 94
నడచు చుండ లజ్జాసఖి • యడరు చుండ.

ఉ. నిండు మొయిళ్లఁ బాసి యవ•నిస్థలిఁ జేరు మెఱుంగుఁదీవె నా
కాండపటంబు వెల్వడి తు•ఖారమణీమణి తిమ్మమంత్రికిన్
దండ వసించి యున్న కుహ•నాధరణీసురమాళి కల్లనన్
దండము వెట్టి నిల్చె వసు•ధాపతి భ్రాంతి వహించి చూడఁగన్ 95
చ. ఉవిద కుచోరుభారమున • నోపక సూక్ష్మవలగ్న మెంతయున్
జవజవ లాడు చుండ వ•దనంబును వంచి మహీశు చెంగటన్
సవినయ మొప్ప నిల్వ నల • క్ష్మాతలనాథుడు మోహదృష్టులన్
ప్రవిమలకాంచనాంగి పయిఁ•బర్వఁగఁ జూచుచు మెచ్చు చాత్మలో. 96

చ కవివరు లీదృశాంగనలఁ • గాంచి యెఱుంగరు కాన నెన్నఁడున్
బ్రవిమలభంగిఁ జెప్పరు స్వ•భావతరోక్తుల నైన, వానినే
కవియిటఁ బెంచి వ్రాసె నని • కల్లలు పల్కెదు రంతెకాని యీ
యువిదను గాంచుచో నతిశ•యోక్తు లటంచు వచింప రెవ్వరున్. 97

తే. గీ. చిత్రకారుని విద్యావి•శేష మెంచి
తొలుత మెచ్చితిఁ గాని యీ • లలనఁ గాంచ
నాతఁ డంత నేర్పరుడు గా • డంచుఁ దోఁచె
నిట్టి సుందరు లుందు రే • యెందు నైన. 98

తే. గీ. అనుచు నే మేమొ తలపోసి • కొనుచు విభుఁడు
విస్మయంబునఁ బ్రకృతంబు విస్మరించి
యుంటఁ జెంగట నున్న వా•ల్గంటి యోర్తు
గాంచె నాకుహనావిప్రుఁ • గాంచి కాంచి. 99

చ॥ కరము రయంబు మీఱఁగఁ దు•ఖారమణీమణి వామహస్తమున్
గరమునఁ గీలుకొల్పి యల • కాండపటంబుఁ దొలంగఁ ద్రోసి భూ
వరుపయి శాతదృగ్వ్రజము • పర్వఁగ భావపరంపరల్ హృదం
తరమునఁ దోఁప నేఁగి లల•నామణి నాతిజనాంతికంబునన్. 100

ఉ. ఆతని రూపుఁ జూడ మఱి • యాతనిమోము పసందుఁ జూడ భూ
నేతగఁ దోఁచు గాని ధర•ణీసురుఁడే యగుచో విమోహదృ
గ్వ్రాతముఁ బెండ్లికూఁతుపయిఁ • బర్వఁగ జేయునె కృష్ణరాయఁడే
కైతవవిప్రుఁ డై మన తు•ఖాసతి గాంచఁగ వచ్చె నీగతిన్. 101

ఉ. వచ్చినవాఁడు దా కపట•వర్తన మెన్నఁ డెఱుంగ కుంటనో
యిచ్చపలాక్షిఁ గాంచుటనె • యెంతయు లోలమనస్కుఁ డౌటనో
అచ్చపుఁ బచ్చరాల కడె•యంబును మాటొనరింపఁ జాలమిన్
బ్రముచ్చుదనంబు బైటపడ • మోసము దెచ్చికొనెన్ దలంపఁగన్.102

ఆ. వె. అనుచుఁ జేటి వలుక • నాయుత్కళాధీశు
పత్ని యితరరాణి • వాసజనము
ఎంత హాంతకారుఁ • డే యీమహీకాంతుఁ
డనుచుఁ గలవరంబు • నందుచుండ. 103

సీ. బంధింపుఁ డీమహా • వంచకుం డెటుఁ బోవఁ
గలఁ డింక నని యొక • కలికి వలుక
బాధించు టే కాదు • పట్టి వధించు టె
తగు వీని నని యొక్క • తరుణి వలుకఁ
గరుణఁ జూచెద వేల • కరవాల మొందు దె
మ్మనుచు వేఱొక్క సా • హసిక వలుక
నింత యేటికి వంట • యింటికుం డే లెందుఁ
బోఁగల్గు నని యొక్క • పొలతి వలుక

తే. గీ. ఇటుల నంతఃపురాంతరా • నేకవీర
వారిరుహనేత్ర లజ్ఞాన • పూరితాత్మ
లగుచుఁ దలపడిరే కాని • యావసుంధ
రేశు గుణశీలముల నేమి • యెఱుఁగఁగలరు. 104

తే. గీ. అంత నంతిపురిని గల్గు • మంతనములు
చేడె లాడెడి గుసగుసల్ • చెవికి సోకఁ
దాలుత వక్షువుఁ దోడ్కొని చను • చెలువచంద
మరసి తిమ్మయ్య కృష్ణరా • యలను గాంచి. 105

శా॥ ఔరా రాజపురోహితుండ నని రా • జానుగ్రహప్రాప్త వి
స్తారైశ్వర్యయుతుండ నౌదు నని స్వాం • తం బందు గర్వంబు మై
ఈ రీ కైవడి రిక్తహస్తములతో • నే తేరఁగాఁ జెల్లునే
యేరీతిన్ నెఱవేఱు ఖడ్గ మది యేం • దీ విప్రవంశాగ్రణీ. 106

క. చని వేగము ఖడ్గంబును
గొని రమ్మ ప్రధానమునకుఁ • గోవిదవర్యా!
జనవిభుఁడు వినినఁ గినియుఁడె
చనునే ప్రభుకార్యముల నజాగ్రత యనుచున్. 107

మ. కనుసన్నన్ వడి నేఁగు మం చతని వెన్కన్ దాను నత్యుగ్రుఁడై
చనుమార్గన్ ద్రుటిలోన నందుఁ గల కక్ష్యద్వారముల్ దాటి యి
ట్లను నోభూపకులాగ్రణీ! మన రహస్యం బెల్ల విస్పష్టమై
చనెఁ గానన్ మసలంగ రా దిచట మోసం బౌను లేకున్నచోన్.

ఉ. ఇంతులు మీరు రాజు లని • యెట్లో యెఱుంగుటచేఁ దదీయసౌ
ధాంతర మందు నొక్కమొగి • నప్రభుఁ జూడ్కుల మిమ్ముఁ జూచుచున్
స్వాంతమునందు బల్గుసగు•నల్ బచరించుట నే గ్రహించి యి
ట్లెంతయు యుక్తి జేసి మిము • నీవలకుం గొనివచ్చితిన్ నృపా. 109

మ. అహహా కుండిన నానృపుండు కుహనా•వ్యాపారపారీణుఁడై
యిటులన్ గైతవవేషమున్ గొని యిసీ • యే తేర నానే యటం
చటఁ దా నేమి ఘటించునో యవల నే • మౌనో గదా యంచు నే
నిటులన్ దోడ్కొని వచ్చినాఁడ మనుజా•ధీశా! మదిన్ సైన్యమా. 110

ఉ. వంచితశాత్రవద్విరద•వర్గగుహోపమ గేహసీమలన్
మంచితనంబుచే నయిన • మాటల నేర్పుల చేత నైన న
భ్యంచితకీర్తికాముకు డొకప్పుడుఁ జేరఁగ బోఁడు సేరుచో
నెంచఁగ రాని హాని ఘటి•యిల్లుట నిక్కము భూవరాగ్రణీ. 111

వ. అని యిట్లు శేషవిశేషంబులఁ దన శేముషీమహిమచే నత్తఱి
నెఱింగిన తెఱం గెల్ల వాని కెఱింగించుచుండె నియ్యెడ. 112

ఉ. అంతఁ దదుత్కళాధిపతి • యంతిపురిన్ గల మంతనంబులన్
సాంతముగా నెఱింగి తన • స్వాంతమునందుఁ గలంత నెంది యా

యింతుల ఘోరయత్నమున • కెంతయుఁ జింతిలి కృష్ణరాయభూ
కాంతునకున్ లిఖించె నొక • కమ్మ నిజాత్మ హితమ్ముగా వసిన్.

సీ. శ్రీమదశేషస•చ్ఛేముషీగుణతేజ!
రాజాధిరాజ! ధ•రాబిడౌజ!
ఆశ్రితావనదక్ష! • యవనదుర్మదశిక్ష!
కర్ణాటరాజ్యర•క్షణసుదక్ష!
మూరురాయరగండ• వైరివీరోద్దండ!
భండనస్ఫారిత•బాహుదండ!
అఖిలసంశితగేయ • యమలకీర్తినికాయ!
యిద్ధవంశోదయ! • కృష్ణరాయ

తే. గీ. అస్మదజ్ఞానసంజని•తాపరాధ
మెల్ల క్షమియించి శుభలగ్న • మేర్పరించి
భద్రములు సెలువార శు•భస్యశీఘ్ర
మంద్రు గాన వే రండు క•ల్యాణమునకు. 114

చ. అని లిఖియించి రాయలకు • నంప నతం డది మంత్రి కీయఁగాఁ
గనుఁగొని లేఖ నాతఁడును • గత్తికి భాష్యము గట్టి పెంచిలిన్
బొనరుప సమ్మతింతు మది • పూర్వము నుండియు సాంప్రదాయమై
తనరుచు నుండె నంచు వసు•ధాపతికిన్ లిఖియించెఁ గ్రమ్మఱిన్. 115

క. అందుల కానందం బెదఁ
గ్రందుకొనన్ గృష్ణదేవ•రాయమహీసం
క్రందనుఁ డల్లుఁ డగుట నిజ
నందనభాగ్య మని కటక•నాథుఁడు వేగన్. 116

తే. గీ. పెండ్లియత్నముల్ సలుప వేం•కోజి విభుఁడు
నందఱకు నన్నిపనులను • నప్పగింప

నధిపు నాజ్ఞ మౌళి వహించి • యద్భుతముగ
సర్వసిద్ధం బొనర్చిరి • సరగ నపుడు. 117

సీ. గాయకగాయకీ•గానమాధుర్యంబు
వీనుల విం దయి • వెలయు చుండ
వివిధవర్ణాంచిత•విస్ఫురత్కేతన
తతి నేత్రపర్వ మై • తనరు చుండ
ఘనసారమిశ్రితా•గరుచందనోత్కర
శ్రీ ఘ్రాణములకు సం•ప్రీతి గొలుప
ఏలాలవంగజా•జీలసత్తాంబూల
ములు జిహ్వ కింపు సొం•పులు ఘటింప
తే. గీ. వివిధఫలపుష్పపత్రశో•భితము లైన
పెండ్లిపందిళ్ళు మేనుల • స్వేద మార్పఁ
గరము పంచేంద్రియాహ్లాద•కరము గాఁగ
నొప్పు చుండెను వైవాహి•కోత్సవంబు. 118

క. కర్త్రికి భాష్యము గట్టి మ
హత్తరవైభవములతోడ • హర్షం బలరన్
బిత్తరికి దుఖారమణికి
నర్తుఁ గటకపతి పరిణ•యం బొనరించెన్. 119

* సీ. గీర్వాణినవవల్ల•కీరావకరణిఁ బు
ణ్యావధూవతంసగీ•తాళిపొల్చ

---

* ఈ పద్యము షోడశదళపద్మబంధ సీసముగుటచే, నొకదానిలో నొకటిగాఁ బదునొకండు వలయము లేర్పరించి వానిని పదునాఱు భాగములుగ విభజించి గడికొక్క యక్షరముచొప్పున యెగువనుండి దిగువకును దిగువనుండి యెగువకును వ్రాసినయెడల మధ్యవలయములో 'క' అను నక్షరమును నేడవ వలయములో "వధూవరుల కైశ్వర్య చిరాయువు లబ్బుగాక" యనియు నేర్పడును.

వర్ణాటపాటనా•కర్ణసంజనితోరు
కౌతుకంబు సౌనాయి • గ్రాలఁ దెలుప
సూతకవిజనాళి • శ్లోకైన మాగధ
సంతతుల్ శశ్వద్య•శంబు నెన్న
కనదభినంద్యార్య•జనుల మధురరసాం
చిత సూక్తులోలుక నా•శీస్సులొప్ప
తే. గీ. రాణ ద్వైవార మానస•ప్రాయులైన
యాప్తనికరోల్లసత్పురీవు • లలర రమ్య
గంధ మలఘుతరా మోద•కరము నొచు
నబ్బురంబు హృత్కంజ హృ•ద్యంబుఁ గాగ
నహహా ! యకలంకమయిన క•ల్యాణ మయ్యె. 120

గీ. అంత నాలవనాఁడు భూ•కాంతుఁ డాత్మ
జాతకు నమూల్య రత్నభూ•షప్రశస్త
వస్తువాహనాందోళిక•ప్రతతితోడ
సారెఁ బెట్టింప సమకట్టె • సంభ్రమమున. 121

గీ. దాసదాసీజనములు గొం•దఱు ప్రయాణ
కౌతుకమున నుండిరి వియో•గంబు దలఁచి
కొంత ఉత్సాహహీను లై • డెంద మందుఁ
గుందుచు నిటుల భాషించు•కొనిరి యపుడు. 122

చ. అల విరివిల్తుకోలలకు • నగ్గలముం బొనరించి పోదువే
నెలకొకసారి యైన రమ•ణీమణీ! నీదగు క్షేమవార్తలన్
దెలియఁగ వ్రాయు చుందువె మ•దిన్ నను జ్ఞాపక ముంచుకొందువే
చెలియరో నా కి దేటి భ్రమ• స్త్రీలమనంబు లెఱుంగరానివే.123

క. అని తహతహపడు నొక భోజు
గుని దరహసితాస్య యగుచుఁ • గూరిమిచూపుల్
బెనఁగొనఁ గని నిజహస్తం
బును నైచెన్ వాని హస్త•మున శపథముగాన్. 124

చ. నెలత యొకర్తు పల్కెఁ దన • నెయ్యుని గౌఁగిలి వీడలేక య
శ్రులఁ గొనగోటఁ జిమ్ముచును • జూడ్కుల దైన్యముదోఁప నీమదిన్
గల తమి నిక్కమేని నను • గాంచఁగ ర మ్మెపు డేని నా కిఁకన్
సెలవు ననుగ్రహింపు మని • చెక్కిలి ముద్దిడి వీడె నాతనిన్. 125

ఉ. తమ్ముని జూడవత్తు నని • తన్వి యొకర్తుక, తల్లిఁ జూడఁగాఁ
గ్రమ్మర వత్తు నంచు నొక • కామిని యిట్టుల వేఱురీతులన్
దమ్ము నెఱుంగు వారలకు • దద్దయు సమ్మతి గల్గఁ బల్కి మో
దమ్మునఁ గొంద ఱంగన లు•దారగతిన్ జను జేరి రయ్యెడన్. 126

ఉ. నాతి యొకర్తు మంతనము•నన్ బరిబోధితచిత్తయై గుణో
పేతకుఁ బెండ్లికూఁతునకు • వేనలి దిద్దుచు వేడ్కఁగొల్పు కై
సేతలఁ జేయుచున్ నయన•సీమ దొరంగెడి బాష్పజాలమున్
జేతుల నొత్తుకొంచుఁ గడుఁ • జింతిలుచున్ వచియించె నీగతిన్. 127

సీ. మేదురామోదస•మ్మిశ్రితసూనజా
తమ్ములు క్షణజీవి•తమ్ము లయ్యె
శ్రుతిపర్వగానవి•శ్రుతి గన్న కలకంఠ
రుతజృంభణం బొక్క • ఋతువె యయ్యెఁ
బరిపూర్ణయౌవన•భాగ్యంబుతో శశి
తనరుట నెల కొక్క • దినమె యయ్యెఁ
గనులకు మిఱుమిట్లు • గలిగించు మించుల
డంబులు జలబుద్బు•దంబు లయ్యె

గీ. నీదు జవ్వన మెల్ల నో • నీరజాక్షి
అడవిఁ గాచిన వెన్నెల • యట్లు గాఁగ
నేఁటితో నీకు నూ ఱేండ్లు • నిండె ననుచు
వగలఁ బొగలెద మగువ శే•వగలు మిగుల. 128

గీ. భువనమోహిని వనఁ జెల్లు • పోలతి నీదు
సుందరాకారగరిమంబుఁ • జూచు భాగ్య
మింక నోఁచ మైతిని గద • పంకజాక్షి
యని తుకారాము మోము దై•న్యమునఁ జూచె. 129

గీ. అట్టి చూపున కాభీత•హరిణనేత్ర
యొడలు జల్లనఁ జెమ్మట • లొలిఁ గ్రమ్మ
నేమొ యశుభంబు వల్కెడ • నిట్టివేళఁ
గుండ నేల ని గ్గానిపోవ • కుందు నటవె. 130

క. అందుల కా చేటిక యనె
కుందరదన! నీవు వట్టి •గోలవుగద నీ
బంధుగుల డెందమునఁ గల
సందియముం దెలిసికొనఁగఁ • జాలవు సుమ్మా. 131

క. కులహీనుని బెండిలి యయి
కులశీలగుణంబు లలరు • కోమలి యిఁక నీ
వలనన్ బాలను బోలిన
కులమునకుఁ గళంక మగుట•కున్ సైపుదువా. 132

క. జలబుద్బుదనిభజీవం
బుల కై తమి రేచి యశము • బూది యొనర్పన్
లలనా! తగునా? కావునఁ
గులగౌరవ మెటులఁ గాచి•కొందువొ మఱియున్. 133

క. మానంబు కంటె నధికము
ప్రాణమె యని తలఁచి గౌరవము నిలుపనిచో
నానెలత నాకుమారిక
గానేర దటంచు జనని • కడు వగఁ బొగులున్. 134

చ. అన విని యాపడంతి హృదయంబునఁ దల్లడ మంది నీమదిన్
వనరెద వేల యిట్టితఱి • బాష్పజలంబులఁ గ్రుమ్మరింపుచున్
ఘనునిఁ దయాప్రపూర్ణుని నఖండయశున్ జగదేకసార్వభౌ
ముని దమ యల్లుగాఁ గొనుట • పుణ్య మటంచుఁ దలంతు రేగదా!

గీ॥ జనకు రాజ్యంబు దక్కెను • సమరభూమి
నతులసంఖ్యాకజనసంక్షయంబు దప్పె
నేను కులహీన నయిన న య్యెదను గాక
స్వాంత మం దేటికే యింత • చింత కాంత? 136

వ. అని వచియింపుచున్న తఱిఁ దుఃఖారమణీమణి నిజజననియుఁ దక్కుంగల బాంధవశ్రేణియు మఱికొందఱు పుణ్యాంగనలును న య్యెడ కేతెంచి కూఁతుఁ గౌగిలించుకొని, సంతతబాష్పధారాకలితకపోలయుగళ యై కరము దురపిల్లుచు దురంత చింతార్ణవనిమగ్నస్వాంతయైన రాజమాతకు నంతఃపురకాంతలలోఁ గొంద ఱిట్టు లనిరి. 137

సీ. అల్లారుముద్దుగా • నాబాల్య మందుండి
కని పెంచి పిదప నొక్కనికి నొసఁగి
ప్రాప్తయౌవన యైనఁ • బదపడి యత్తవా
రింటికిఁ బంపుచో • హృదయసీమఁ
గల వియోగాగ్నికిఁ • గ్రాగి చింతావార్ధి
మునిఁగి కుందుదు రెట్టి • పురుషులైన
జాతిగుండె గలట్టి • నాతులైనను వారిఁ
గనువారలకును దుఃఖంబు వొడము

గీ॥ సహజ మియ్యది భువిఁ గల • సకలజనుల
కిదియె కడుపు తీపి యనంగ • నెన్నఁబడును
ఇద్ది బిడ్డలఁ గనువారి • కెల్లరకును
దెలియుఁ గాని యితరులకు • దెలియఁబడదు 138

గీ. అయినఁ గర మిట్లు వాపోవ • నగునె మీకు
మీరు వచ్చినరీతి నీ • మెలతగూడ
నేఁగు చున్నది యత్తవా • రింటి కిపుడు
ఆడుబిడ్డల కిది విధి • యగు గదమ్మ. 139

గీ. అవధరింపుము మీపట్టి • యతులసుఖము
నందుచో నందు మీకు నా•నంద మొదవుఁ
గష్టగతి నున్న నెపుడు దుః•ఖంబుఁ గూర్చుఁ
గాని మీబాల సుఖలీలఁ • గడుపఁ గలదు. 140

ఉ. పుట్టెను రాజవంశమునఁ • బుణ్యవశంబున భాగ్యరాశి యై
పట్టపుదేవి నాఁ బరగ • బంధురవిక్రము సార్వభౌముఁ జే
పట్టెను గీర్తిచంద్రికలు • పర్వ సుమంగలి యై కరంబు మీ
పట్టి సుఖింప గల్గు మదిఁ • బాయుము వ్యర్థవిచార మమ్మరో. 141

క. అనవుం డింకొక చెలి యి
ట్లనె నాతఁడు చక్రవర్తి • యని సంతసముం
గొనఁ జాలదు కులహీనుఁడు
తన తనయకు భర్త యగుటఁ • దద్దయు వగచుం. 142

గీ. తల్లిమాత్రమె గాదు సో•దరుఁడు దక్కు
గల్గు రాజబంధువులు నీ • కార్యమునకు
బిట్టు శంకింపు చుండిరి • విమలవంశ
మునకుఁ గల్గెఁ గళంక మం • చనిశ మతివ! 143

ఉ. నావుడు రాజమాత నయ•నంబుల నశ్రులు గోట మీటుచున్
భావిసుఖానుభూతి గను • భాగ్యము మాసుత నోఁచ దయ్యె నిం
కేవిధి జీవితాశ వహి•యించును దుష్కులుఁ బెండ్లియాడి యీ
పావనవంశజాత యని పల్కెను ఱాల్గఱగంగ నేడ్చుచున్. 144

గీ. అంతలో లగ్న మాసన్న • మయ్యె నని పు
రోహితుఁడు దెల్ప సముచిత•వాహనముల
శకటముల నధిరోహించి • సకలభృత్య
తతి ప్రయాణసన్నాహత•త్వరత నుండె. 145

సీ. కన్నవారిని వీడి • యెన్నఁ డెఱుంగమిఁ
దోఁచు చున్న వియోగ•దుఃఖ మొకటి
దాసి వల్కిన ఘోర•తరవాక్యసరణిచేఁ
దోరమై యుబికెడి • దుఃఖ మొకటి
జననియె తనమృతి • కనుమతింపఁగ నింకఁ
దోడు నాకెవరను • దుఃఖ మొకటి
ఇహసుఖంబుల నెల్ల • నెడఁబాసి యసువులఁ
దొరఁగు టెట్లని మించు • దుఃఖ మొకటి

గీ. ఇన్ని దుఃఖంబు లేకమై • యిగురుబోఁడి
స్వాంత మెల్లను దల్లడఁ • మందఁ జేయ
నెలత కపుడు కన్నీరు ము•న్నీరు గాఁగ
జెట్టు విడచిన లతవోలె • క్షితిని బడియె. 146

గీ. ఈ రహస్య మెఱుంగని • వార లగుటఁ
గొంద ఱా యింతి కేల్వట్టి • కోమలాంగి!
సార్వభౌము నర్థాంగి వై • సకలసిరుల
నందఁ బోవు నీ వీ రీతిఁ • గుంద నగునె! 147

క. అని లేవఁదీసి జననీ
జనకులకుఁ బ్రొక్కఁజేసి ♦ సవినయమున నా
వనితను నందల మెక్కిం
చిన నెల్లరుఁ బయన మయిరి ♦ శీఘ్రము గాఁగన్. 148

ఆ. వె. చూపు మేరవఱకుఁ జూచుచుఁ దలిదండ్రు
లాప్తబంధు జనము ♦ లార్తి నొంది
చేరఁ జనిరి తమ తు♦ఖారాము గుణముల
నరసికొనుచు నిజగృ♦హముల కపుడు. 149

వ. రుచీదేవి యనునామాంతరంబునఁ బరగినతుఖారామసతీవతంసమధిరో
హించియున్న యందలంబును దక్కుంగల పరిచారికాబృందంబును
శ్రీకృష్ణదేవరాయశిబిరంబు సేరం జనుదెంచిన నంతకుమున్న ప్రయా
ణోన్ముఖం బై యున్న తచ్ఛిబిరంబును దోడ్తోనఁ గదలి కతిపయ
ప్రయాణంబుల నిజరాజధానియయిన విజయనగరంబు సేరిరి. అంత—

సీ. పౌరు లత్తఱి మోద♦భరితు లై యొనరించు
జయజయధ్వను లజ♦స్రమును వెలసె
సౌధాగ్రముల నున్న ♦ జలజపాణులహస్త
వితతినుండి ప్రసూన♦వృష్టి గురిసె
ననుపమోత్సాహసం♦జనితకారణము లై
వివిధతూర్యరవము ♦ వెల్లివిరిసెఁ
గేళిమై విజయోత్స♦వాలోకనాగత
జనతతికలకల♦నినద మొలసెఁ

తే. గీ. బురము నలుదెసల్ శృంగార♦భరిత మగుచుఁ
గనుల పండువు గాఁగ నా ♦ క్ష్మావరుండు
గజవరారోహణుం డయి ♦ నిజపురప్ర
వేశ మొనరింపు చుండిన ♦ వేళయందు. 151

సీ. ఈరీతి సాళువ•నారసింహుని గోర్కెఁ
దనియించె ఘనదుర్గ•తతి జయించె
సంగరావని శత్రు•సమితి ను క్కడగించెఁ
ప్రథితవిక్రమచరి•త్రమున మించె
దశదిశావళి నంచి•తయశంబు వెలయించె
వినుతరవిజయల•క్ష్మిని గడించె
సింహాచలాదిపు•క్షేత్రముల్ దర్శించె
గాఁ గోరుకొనిన సుం•దరిని గాంచె
గీ. సత్కవీశ్వరబృందంబు • సత్కరించె
శూరు లైన సేనానుల • గౌరవించె
రమ్యతరకీర్తి శాలి యా • రాజమౌళి
సూరిహృత్పయోరుహహేళి • సుగుణపాళి 152

ఇది

గద్య:—శ్రీవిరాడ్విశ్వకర్మ వంశసంజాత, శ్రీరామన్వయదుగ్ధపయోధి
సుధాకరాంగిరసగోత్రపవిత్ర, గంగయాచార్యపుత్ర,
సుబ్బమాంబాగర్భ శుక్తిముక్తాఫల, శ్రీశ్యామలాంబ
పాదారవిందమకరందాస్వాదసానందహృదయేం
దిందిర, వీరబ్రహ్మాహ్వయ ప్రణీతం
బైన 'తుఖారామ్' నామక
ప్రబంధము నందలి
ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# తుఖారామ్.

---

## తృతీయాశ్వాసము.

గీ. అంత నొక సుముహూర్తంబు •నందు మనుజ
విభుఁడు నూత్నవధూసమా• వేశమునకు
నుల్ల మందున నువ్విళు • లూరు చుండి
యా రుచీదేవిఁ గై సేయ • నాజ్ఞ యొసఁగ 1

సీ. పూర్ణేందునందుఁ బెం • పొందు కందువునాఁగ
మొగమునఁ గస్తూరి • బొట్టు వెట్టి
మించుతళ్కుల నీను • మెఱు పట్ల మైజిగి
వెలువరించు జిలుగు • వలువ గట్టి
లోకైకనవమోహ•నాకారమున కొప్పు
లలితభూషలచే న•లంకరించి
గమగమవలచు సు•గంధతైలాళిచే
నళికుంతలముల వే•నలి ఘటించి

గీ. పునుగు జవ్వాజి యత్తరు • పూఁత లలఁది
కాంచువారల మేనులు • గగురువొడవఁ
బంచబాణుని యాఱవ • బాణ మనఁగఁ
జెలువ లాపూవుబోఁడిఁ గై • సేసి రపుడు. 2

గీ. సహజసౌందర్యమొందు లే • జవ్వనం బొ
కండు నునుసిగ్గు వే ఱొకండు • గలిగి నిగుల
నా రుచీదేవి నూత్నసౌ • యగము దాల్చి
యతనుసామ్రాజ్యలక్ష్మి నా • నలరెఁ గరము. 3

గీ. అట్టి సంతోషసమయ మం • దాత్మజనని
బోధ యొక్కింత మఱచి యా • పూవుఁబోఁడి
రమ్యశృంగారభావత • రంగ రాజి
యుల్లమునఁ బొంగి పొరల నా • యువతి యొప్పె.

గీ. అంతలో గుండె తటతట • లాడ సాఁగె
సుదతి కాపాదమస్తకం • బొదవె స్వేద
మపుడు ధూమకేతువు నా ద • యావిహీన
యైన పూర్వోక్తదాసి ప్ర • త్యక్ష మయ్యె. 5

గీ. వచ్చి యేకాంతమునకు నా • వనజముఖిని
బిలచి యిట్లని పలికె నో • కులపవిత్ర!
తెలిసెఁ గాదె మీవారి యు • ద్దేశ మెల్ల
నీదు కులగౌరవం బెట్లు • నిలిపికొనెదొ.

శా. నిజబాహాబలగర్వసంభవమదాం • ధీభూతచేతస్కుఁడై
గజపత్యన్వయనీరజాకరమహా • గాంభీర్యహస్తీంద్రుఁడై
సుజనస్తుత్యభవజ్జగద్ధితయశో • జ్యోత్స్నాంబుదుం డై త్వదీ
యజనశ్రేణిఁ బరాభవించిన యతం • డా భర్త నీ కంగనా? 7

చ. అల దమయంతిచందమున • నందము చందము గాంచి డెందమం
దలరి వరించితే యతని • నల్ల శకుంతల లీల ముగ్ధవై
వలచితె మంతనంబున సె • బాసు వలంతి వలంతి దాని కై
కలత వహింతు వేల గజ • గామిని నామనవిఁ గ్రహింపుమా. 8

చ. మగఁడు మగండఁటన్న యభిమానము మానుము మానసంబునన్
మగఁ డెటు లౌను నీ గురుజనమ్ముల నిమ్ముల నమ్మ! సమ్మతిం
పఁగ నొనరించి నీకరము వట్టెనె? యిట్టి కళంకుఁ డేడ? నీ
యగణితవంశ మేడ? మగువా! తగవా తగువారు నవ్వరా. 9

చ. చలము వహింపు మమ్మ యిదె సాయకమున్ గొనుమమ్మ నీవు రా
కులతిలకంబ వమ్మ మది కొంకును జంకును బూన కమ్మ చం
చలతరజీవితార్థ మయి శాశ్వతకీర్తిని వమ్ము సేసి స
త్కులమునకున్ గళంకమును గూర్తువటమ్మ వినీలకుంతలా. 10

గీ. వంచకుండైన యీనృపవరు వధింప
యత్న మొనరించి నీసోదరాది ముఖ్య
జనులు విఫలమనోరథస్వాంతు లైరి
దాని నీ విప్డు దీర్చి సద్యశముఁ గొనుము. 11

క. రాజానన! నీ వాక స
ద్రాజకులాభరణమవుఁ గదా గోత్రంబున్
యోజించుకొని యశశ్శ్రీ
రాజిల భువి వెలయు మమ్మ రాజకుమారీ! 12

ఉ. ఆర్తిని జెందకమ్మ మది నైహికసౌఖ్యము లెంచకమ్మ స
త్కీర్తి గడింపుమమ్మ భువి దేహము బుద్బుదతుల్య మమ్మ స
ద్వర్తన మింత లేక మిము వంచన సేసెఁ గదమ్మ యీమహీ
భర్త వధించుటే సకలబంధుహితం బగు నమ్మ నావుడున్. 13

క. కులవంతుఁడో కులహీనుఁడో
తలిదండ్రులు గూర్చినట్టి ధవుఁడు గదే నీ
పలుకుల కేమందును ని
శ్చలమతి బోధించె దిట్లు చను నే యనఁగన్. 14

గీ. నాదు బోధ గాదిది తల్లి! ♦ నీదు సోద
రాదిగురుజనంబుల బోధ ♦ యతివ! మనుజ
వరుఁడు మోహాంధుఁడై యున్న ♦ తరుణ మరసి
యీకృపాణి చేఁ గొని వధి♦యింపు మమ్మ. 15

మ. అనినన్ విభ్రమచిత్తయై యకట క♦ర్ణాటాంధ్రరాజ్యేశుఁ డా
యని తేజోబలశౌర్యముష్కరతురు♦ష్కారణ్యదావానలున్
ఘనసారేందుపటీరచందనయశున్ ♦ గాంభీర్యసన్మద్ధవున్
దునుమన్ గారణ మేమి యేన మరణిం♦తున్ బంధుప్రీత్యర్థమై. 16

ఆ. వె. అనిన దాసి మఱల ♦ ననియె నద్దానిచే
నేమి లాభ మమ్మ ♦ నృపుఁడు మగిడి
దాడి వెడలి యాజి ♦ నోడించి మీవారి
రాజ్య మెల్లఁ గొనఁడె ♦ రమణి! యనుచు. 71

క. జవజవ మను నొక ఖడ్గము
నువిద వలగ్నంబు చుట్టు ♦ నొడ్డాణ మటుల్
సవరించి పైటచే మెల
కువగాఁ గనఁబడక యుండ ♦ గుప్తము సేసెన్. 18

ఉ. అత్తఱిఁ గొంద ఱబ్జముఖు ♦ లయ్యెడకుం జనుదెంచి కంటివే
చిత్తజు నాశుగంబులకుఁ ♦ జిక్కి నృపాలుఁడు సృక్కెఁ గాన మీ
బిత్తరిఁ దోడి తెం డనుచు ♦ వేడ్కమెయిన్ శయనగృహంబునం
దత్తరుణాంగిఁ దోడ్కొని ప్రి♦యంబునఁ జేర్చి నృపుండు మెచ్చఁగన్.

మ. సకలోర్వీతలనాథవాళిమకుటాం♦చద్రత్నరమ్యప్రభా
త్మకనీరాంజనపాదపద్ముఁడగు నీ ♦ క్ష్మాకాంతుఁ డెంతేని తా
వకసందర్శనమాత్రమోహవివశ♦స్వాంతంబుచే రాకుమా
రిక! సృక్కెన్ దరిఁ జేరి యేలుకొనుమా ♦ వ్రీడాసతిన్ వీడుమా.

మ. అని యొక్కొక్క నెపంబు సెప్పి వడి య • య్యంభోజపత్రేక్షణల్
చన నచ్చోటును బాసి, హర్షపులకాం•చద్దేహులై వేడ్కతోఁ
గని డాయం జనుదెంచుచున్న ధరణీ•కాంతుఁ విలోకించి యిం
చిన వ్రీడాభయశోకసంశయములన్ • జేతంబు గంపింపఁగన్.

క. కడు వడిని లేచి నిలువం
బడ నుల్కాపాత మటులఁ • బార్థివు మ్రోలన్
పడతి మొల నున్న ఖడ్గము
పుడమిన్ బడె ఘల్లు మనెడి • మ్రోఁత జనింపన్. 22

క. ధర నాగతిఁ బడి యుండిన
కరవాలముఁ గాంచి మనుజ•కాంతుఁడు గడుఁ ద
త్తరపాటు గదురఁ గారణ
మరయుచు నచ్చోటు వాసి • యాత్మగతమునన్. 23

సీ. తరుణి కేళీగృహాం•తరమున కిటు ఖడ్గ
ధారిణి యై చను•దేర నేల?
సరస సంభాషణ•సరణిఁ జూపక తలో
దరి మౌనముద్రను • దాల్ప నేల?
పూర్ణేందుబింబంబుఁ • బురడించు వదనంబు
కాంతిహీనం బయి • క్రాల నేల?
నిర్హేతువుగ నవ•నిం బడి దుఃఖాత్మ
యగుచు నింతగ వగఁ • బొగల నేల ?
గీ॥ తెలిసెఁ బో తమ్ము కపటవృత్తిని జయించి
పురముఁ నాక్రమించుకొనంగఁ • బూనితి మని
పట్టి నొసఁగి సంధికి నొడం•బఱచి యిటులఁ
దరుణమున వధింపం జేయఁ • దలఁచి రొక్కొ. 24

వ. ఇట్టి బలాత్కారపరిణయం బనర్థదాయకంబ యని యాసతీమణి దోషి యనికాని నిర్దోషి యనికాని నిర్దేశింపక గజపతీంద్రుఁ డంపిన పరివారసమేతంబుగ మగిడి నామగువను జనకగృహంబున నత్తఱిణంబవిడిచి రాఁదనభృత్యులకు నియోగించిన వారును బ్రయాణసన్నద్ధులై కటకపురి చేటీజనంబు చేష్టలందక్కి భూతలపతిత యై యున్న యయ్యన్నులమిన్నను గ్రన్నన బోదివి తెచ్చి యందలంబునఁ బ్రవేశపెట్ట నెల్లరును బురంబు వెలువడి యొక్క ముహూర్తమాత్రంబున నిబిడారణ్యమార్గంబులం బట్టి యేఁగుచుండిరంతఁ గొంతవడికి స్మృతి వచ్చి దురంతచింతాక్రాంతచిత్త యై యున్నయక్కాంతాతిలకంబు నిజాంతరంగంబున నిట్లు వాపోవం దొడంగె.

సీ. పాపంబు దాగునా • నాపాపఫలరాశి
పక్వ మై యీరీతిఁ • బండె నకట
చేసినవారికిఁ • జేసినంత యనుభ
వింపక తప్పునా • విశ్వ మందు
రాజపుత్త్రిక నయి • రారాజపత్ని నై
తుద కిట్లు దుఃఖాబ్ధిఁ • దోఁగ వలసె
ప్రాణేశు వధియింపఁ • బొల్పడె దుష్కర్మ
రా లను నపకీర్తి • నంద నయ్యె
గీ. ఏము నుడివిన గతి వధి•యింప నైతి
వనుచు దూరు నాప్తుల కడ • కరుగు టెట్లు
ఇటులఁ బుట్టిల్లు మెట్టిన యిల్లు గాక
రెంటికిని జెడ్డ రేవడ • రీతి నైతి.

26

మ. పతిఁ జంపన్ దొరకొన్న దుర్భరమహా•పాపాత్మురా లంచు భూ
పతి యోజింపక దుష్టశిక్షణ మొనర్పం జాలియు నత్కృపా

మది నింతేనియు గాసి సేయఁగఁ దలంపం బోక మచ్చేటికా
తతితో జన్మగృహంబు సేరఁ డనుచుఁ దాఁ బంపు చున్నాఁ డహో. 27

సీ. సురుచిరదివ్యసుందరవిగ్రహము నైనఁ
గలవుదీరఁగ నింత కాంచ నైతి
నీధౌర్త్య మెల్ల దుర్బోధిత యై దాసి
చేసె నటంచు వంచింప నైతి
నీ పాదమాన మే పాప మెఱుంగ నక్
షమియింపు మని మ్రొక్కఁ జాల నైతి
నింతటి కరుణార్ద్రహృదయుఁ డటంచు నా
బుద్ధి నింతయుఁ దలపోయ నైతి

ఆ. వె. సద్యశంబు మీఱి సర్వసర్వంసహా
చక్ర మేలఁ జాలు సార్వభౌము
కాంత నయ్యుఁ బూర్వకర్మవశంబున
దిక్కులేని పగిది దీన నైతి. 28

ఉ. ఎంతటి ప్రేమయో హృదయ మెంతటి ధర్మగుణైకపూర్ణమో
యెంతటి సుప్రసన్నతయొ యెంతటి మోహపరత్వమో మహీ
కాంతుఁ డొకింతయేని నను గాసి యొనర్పక పంపె నాదు దు
శ్చింతనముఁ గ్రహించియు నిసీ! యిఁక నాబ్రదు కేల కాల్పనా? 29

సీ. సత్కళానిధివి యజ్ఞానజాతాపరా
ధం బంచు క్షమియింపఁ దలఁపలేవో
సరసజ్ఞుఁడవు ప్రపంచజ్ఞాన మెఱుఁగని
పసికూన యని జాలి వడయలేవో
ఎవ్వారు సంధించి రేటి కీకరవాల
మని ముఖాముఖిని నన్నడుగలేవో

ఇంతటి దారుణకృత్య మీయింతి గా
వించునా యనుచు భావింపలేవొ
గీ. అక్కటా విధి బలవంతుఁ డౌ కతాన
నిట్టిపాటు ఘటిల్లె నీ వే మొనర్తు
కాక యుండిన సత్కృపా కలితమతివి
ఆదరింపవొ మన్నించి యబల ననుచు. 30

క. అని పరిపరి తెఱఁగుల నా
వనజాక్షి దురంతదుఃఖ వననిధిలోనన్
మునుఁగుచు వగచుచు నాకా
ననమునఁ బడి చనుచుఁ దనమనంబున మగుడన్. 31

సీ. దట్ట మౌ పొదలఁ గన్పట్టు మిణుంగురు
వెలుఁగులు కొఱవుల విధముగాఁగ
బోయవాండ్రొనరించు మూల్గులు మిత్రబాం
ధవతతిరోదన ధ్వనులు గాఁగఁ
గునుకుచుండిన ఘోర వనసత్వముల గుఱ
కలు సృగాలారావ కరణి గాఁగఁ
దా నధిరోహించి తరలుచుండిన యంద
లంబు శవార్థ కాష్ఠంబు గాఁగఁ
తే. గీ. దన ప్రయాణంబు జీవితాంత ప్రయాణ
ముగను గమ్యస్థలి శ్మశానముగను దలఁచి
భూరిదుఃఖప్రవాహంబు పొంగి పొరల
వగలఁ బొగులుచుఁ జనుచుండె మగువ యంత. 32

తే. గీ. అతివ దుర్భరతరదైన్య మరసి కరము
చింతచేఁ బరస్పరమును జెప్పికొనెడి

పలుకులం బోలె భూరుహ•ప్రతతి నున్న
పక్షికులముల కలకల•ధ్వనులుఁ జెలఁగె. 33

గీ. కనికరము గొల్పు నాసాధ్వి • చరితమెల్ల
నరసి దుఃఖిత యగుచు నీ•హారబిందు
కైతవంబుచేతఁ బ్రకృతి•కాంత కరము
ముత్యములఁ బోలు కన్నీటి•బొట్లు విడిచె. 34

గీ. కర్మవశమునఁ గలిగెడి • కష్టసమితి
కర్మపక్వ మౌ నవల నీ• కరణిఁ దొలఁగు
ననుచుఁ దెల్పు చందమున గా•ఢాంధకార
మల్లఁ దొలఁగె దిక్కులు తెల్వి• నందఁ గలిగె. 35

ఆ. వె. అంత దుఃఖభార • మపనయించుకొని యా
తరుణి తనదు మదిని • ధైర్య మూని
పతికిఁ గాని యట్టి • పడతికి గౌరవ
మెట్లు నిలచు పుట్టి•నింట నైన. 36

సీ. పతిపద సేవాభి•రతియె సద్గతికి సా
ధనము గా కైహిక•ధన మ దేల
నాథు నామోచ్చార•ణమె మానవతికిఁ బా
వనము గా కితరజీ•వనము లేల
ధవు నాదరము గొన్న • తరుణిశీలమె సగౌ
రవము గా కొరుల గౌ రవము లేల
విభుసన్నిధానమె వెలదికి దివ్యమం
దిరము గా కన్యమం•దిరము లేల

గీ. కాన హృత్సీమ మన్మనో• కాంతు నిలిపి
సేవ సేయుచు జీవిత• శేష మిందె

కడపుదానఁ దత్కరుణంబు • వడయు టొండె
మడియు టొండె గావలయు నీ • యడవిలోన. 37

సీ. అని నిశ్చయించి వాహకుల •నిల్వఁగఁ జేసి
తత్ప్రదేశం బాత్మ•ధవుని రాజ్య
సీమలోని దటంచుఁ • జెప్పఁగా హర్షించి
యిఁక నొక్క యెడు గైన • నేఁగ మనుచు
చినగొల్లపల్లె నాఁ • జెలు వొందు న య్యెడ
వాసయోగ్యము లైన • భవనములను
పరిచారికాళికిఁ • బటకుటీరములను
నిర్మింపఁగాఁ జేసి • నిలచి యందు

గీ. తరుతటాకవాపీకూప•తతుల మిగుల
సత్రశాలల వెలయించి • సమధికముగఁ
బురముఁ బెం పొందఁ జేసి యె•ల్లరును దన్ను
వరదరాజేశ్వరి యనంగ, వరలు చుండె. 38

గీ. పరిసరంబునఁ గల జాన•పదుల కెల్ల
విపులముగ భృతి నిచ్చ ల•భించు చుంట
వేనవేలుగ వచ్చి యం•దే నివాస
గృహములను గట్టుకొని వసి•యించి రెలమి. 39

ఉ. పేదలు సంగహీనులును • బిన్నలుఁ బెద్దలు నెల్లవారు నా
మోద మెలర్ప సూపఘృత•భోజ్యతతిం బరితృప్తి నొంది యీ
మేదిని నన్నపూర్ణయె సు•మీ యిటు వచ్చి కృపాంతరంగ యై
మేదుర ధర్మకార్యము ల•మేయగతిం జరిగించు నద్దిరే. 40

ఆ. వె. ధరకు వచ్చి నట్టి • ధనలక్ష్మి యపరావ
తార మొక్కొ లేక • వారణాసి

పురిని వెలయు నన్న • పూర్ణయె గా కున్న
నిట్టి ధర్మపరత • యెట్లు గలుగు. 41

సీ. పూజార్హ సుమజాల • ములె గాని యారామ
సమితి వే ఱొక పుష్ప • జాతి లేదు
కాషాయవస్త్రముల్ • గట్టుదురే కాని
కాంచనాంబరములఁ • గట్ట రొకరు
అమలకీర్తియె గాని • యాయింతి పావనా
కారంబు గాంచిన • వారు లేరు
ఏదేశమో మఱి • యేసార్వభౌముని
దేవేరియో యింత • తెలియఁ బడదు
గీ. అనుచు జను లెన్ను చుండ నా • యమలశీల
భర్తృపదపంకజార్పిత • స్వాంతభృంగ
యగుచుఁ దన్నామసంస్మర • ణాభిరతియె
తనకు నిత్యవ్రతంబుగాఁ • దనరు చుండె. 42

గీ. వరదరాజమ్మ కీర్తి ది • గ్వ్రాత మందు
విస్తరిల్లిన కొలఁది నా • వీడు పెరిగెఁ
గాని సేద్యానుకూలంబు • లైన నీటి
వసతు లింతయు లే కున్కి • బాధ గలిగె. 43

గీ. వాగులై పారుచును బ్రతి • వత్సరంబు
గురియు వర్షంబు వ్యర్థమై • యరుగు చుంట
నరసి యాయమ్మ గొప్ప జ • లాశయమును
గరుణ నయ్యెడ నిర్మింపఁ • గాఁ దలంచె. 44

సీ. ఆపురాంతిక మందు • నత్యున్నతంబులై
వలయాకృతిని మూఁడు • వైపులందుఁ

కలవు కొండలు నాలు • గవవైపు మూయింపఁ
గొన్ని యోజనముల • కొలఁది గలిగి
సంద్రంబు బోలు కా • సార మేర్పడు నని
వేనవేల్ ప్రజల రా • వింపఁ జేసి
కట్టించె నొకపెద్ద • కట్ట యంతట గిరి
శ్రేణి వర్షించి యా • చెరువు నిండెఁ
గీ. గాని సేతువు నూతన • మైన దగుటఁ
దమప్రయత్న మెంతయును వ్యర్థంబు గాఁగ
గండి వడి నీరు ప్రవహింపు • చుండి యొక్క
క్షణము లోపల నొక పెద్ద • కాల్వ యయ్యె. 45

సీ. మన కదృష్టంబు లే • కుని కిట్టు లయ్యెనా
యమ్మ యేమి యొనర్చు • ననెడివారు
నరబలి గోరుచు • న్నది యేమొ గంగాభ
వాని యంచుఁ గరంబు • వలుకువారు
ధనరాశి గ్రుమ్మరిం • చునుగాని నరబలి
యెటు లీయఁ గలదని • యెంచువారు
ఆస లెల్లను వ్యర్థ • మయ్యెఁ గదా యంచు
వేమారు నిట్టూర్పు • విడచువారు
గీ. నగుచు దురపిల్లు చుండిన • యవసరమున
వృద్ధురా లొకొర్తుక శివ • మెత్తి నట్లు
గంతు లిడుచు నేతెంచి యీ • గండి నేఁడు
బలి యొసంగ కుండిన గట్టు వడదు నిజము. 46

క॥ చినకంబఁడు పెదకంబం
డను నిరువురు గలరు తనయు • లమ్మా! వారల్

చని గంగకు బలి యై క్షో
ణిని గీర్తిశరీరముల్లను • నిలుపుదు రెలమిన్ 47

ఉ. ఎందఱు పిన్నపెద్దలు మ • తెందఱు భోగులు జోగు లేఁగి రా
యందఱి యూరుపేరు గల•దా! మరణంబు మహావనాంతరం
బందున దాఁగినన్ దొలఁగు•నా యని శాశ్వతమైన సద్యశం
బంద శరీర మే నొకట • నర్పణముం బొనరింపఁ గాఁ దగున్. 43

సీ. కావున నాసుతుల్ • గంగమ్మ కర్పణం
బొదురు వరదరా•జమ్మ తల్లి!
ఆజ్ఞ యిమ్మా యని • యట మఱి నిల్వక
కొడుకులతో గండి • కడకు వచ్చి
కైకొను మమ్మ గం•గాభవానీ! యంచు
నొడలు మఱచి గంతు • లిడుచు నుండ
తప్పెటల్ మ్రోవ నా • తనయు లిర్వురు నొక్క-
యదటున నాప్రవా•హమునఁ బడిరి

గీ. జనము లెల్ల మహాదేవ • శంభొ యనుచు
మట్టి వైచిరి గండియుఁ • గట్టు వడియె
నాఁట నుండియు వారల • నామ మూని
చెరువు నాయూరు కంబాఖ్యఁ • జెలఁగు చుండె. 49

గీ. మూఢభక్తి నైనను దేహ•ములను విడువ
వలద టంచు రుచీదేవి • వార్తఁ బంపెఁ
గాని యంతకు మున్నె య•క్కార్య మెల్లఁ
దీరి పోయె నం చావలఁ • దెలిసికొనియె. 50

శా. అంతన్ గోట్లకొలందిగా జనుల క•త్యంతానురాగంబుతో
సంతోషంబు ఘటిల్లఁ బెక్కుదినముల్ • సంతర్పణల్ సేసి యా

కాంతారత్నము భక్తిపూర్వకముగాఁ • గాసారసీమన్ మనః
కాంతాఖ్యన్ దగ జాతిశాసనము నొక్కం డుంచె సంప్రీతయై. 51

గీ. అందు శ్రీకృష్ణదేవరాయాంఘ్రియుగళ
సతతసేవాపరాత్మ యా • సాధ్వి యొకతె
భగవదర్పితముగ నిజస్వామి కాయు
రున్నతులు గల్గ వెలయించె • నుర్వి దీని. 52

వ. అని లిఖింపఁ బడియెఁ గాని, తచ్ఛాసనంబునం దైనను నిజాహ్వాయంబు బహిర్గతంబు గాదయ్యె. ఇట్లా మానినీవతంస మైన తుఖారమణీమణియాత్మీయపరిచారికాశ్రేణితోఁ గాషాయాంబరధారిణియై యాబాల్యాభ్యాసితచిత్రకళాకౌశలంబున నిజనాథు మనోహరాకారంబు కరంబు ననురాగంబుమెయి బెక్కురీతుల లిఖింపుచు దత్పాదసరోజార్పిత చిత్తభృంగ యై దినంబులఁ గడపుచుండె నంత నొక్కనాఁడు. 53

శా. చేరెన్ వీరభటవ్రజంబు గొలువన్ • శ్రీకృష్ణరాయుండు దు
ర్వార వ్యాఘ్రవితానమున్ దునిమి భీ•భత్సంబు గావింపుచున్
నారాచంబుల భల్లుకాదిమృగసం•తానంబుఁ బోకార్చుచున్
ఘోరారణ్యము దాటి వేటకయి యా•క్షోణిఁ దచ్చోటికిన్. 54

క. కంబాల చెఱువు నాఁ దగి
యంబుధిఁ బోలిన జలాశ • యంబును దత్తీ
రంబునఁ గల శాసనలే
ఖ్యంబును గని కృష్ణరాయఁ • డాశ్చర్యముతోన్. 55

సీ. సాగరతుల్యకా•సారంబు మద్రాజ్య
సీమ నిల్పిన పుణ్య•శీల యెవరొ
ఈ యూషరక్షేత్ర • మిట్లు సస్యాఢ్యఁగా
నలరించి నట్టి పుణ్యాత్మ యెవరొ

సంతతాభ్యాగత • సమితికి నన్నప్ర
దాన మొనర్చు నీ • దాత యెవరొ
శాసనంబున నాదు • చరణదాసి యటంచు
లిఖియించుకొనిన యీ • లేమ యెవరొ

గీ. అన్నపూర్ణాంబ యను సార్థ • కాహ్వయమున
వెలయు నీవెలంది యెవరొ • విపులకీర్తి
చంద్రికల దిశల్ వెలిగింపఁ • జాలె నహహ
ఈ సతీమణి చరితంబు • నెఱుఁగ వలదె. 56

గీ. వరద రాజేశ్వరి యటంచుఁ • బలుకఁగొంద
అన్నపూర్ణాంబయని కొంద • ఱందు రెలమి
నంతియే కాని యింతి ని • జాహ్వయంబు
తెలియఁ బడ దయ్యె నెవ్వారి • దేవి యొక్క 57

శా. నా రాజ్యంబున నుండి సర్వజనస • న్మాన్యార్హ యై కీర్తివి
స్ఫార శ్రీ వెలయించి మచ్చరణదా • స్యం బూని యున్నట్లు నా
కీరత్నంబు దదీయశాసనమునన్ • బ్రీతిన్ లిఖంపించె న
య్యారే! యీపె యుదంత మారయక రా • జ్యం బెట్టు నేఁ జేరుదున్.

మ. అనుచుం యోజన సేసి యొక్కరుఁడె య • శ్వారూఢుఁ డై యేఁగి యా
జననాథుం డొక బాటసారివలె నా • సౌధంబు డాయంగఁ ద
త్తరుణీ మే తెంచి సతీజనం బతిథిపూ • జాద్రవ్యముం గొంచు స
ద్వినయం బొప్పఁగ స్వాగతం బిడిరి ప్రీ • తిన్ గాంచి సంరంభ లై 59

సీ. ఒకయింతి మజ్జనం • బొనరింపఁ గాఁ జేసి
కలితాంబర శ్రేణిఁ • గట్ట నిచ్చె
ఒకనాతి భక్ష్యభో • జ్యోపేతమృష్టాన్న
సమితిచే దివ్యభో • జనము వెట్టె

ఒకపద్మముఖి బడలిక వాయ దరి నిల్చి
వీవన చేఁ గొని • విసరుచుండె
ఒకకృశోదరి ముద • మొప్పారఁ గర్పూర
విరచితంబై తగు • వీడ్య మొసఁగ

గీ. నిటుల వేర్వేఱు గతుల నా • యిందుముఖులు
సలుపు పరిచర్య కలరి యా • జనవిభుండు
వారి చరిత మావంతయు • వారివలన
నెఱుకవడమి విభ్రాంతి వ•హించి మదిని. 60

క. వారల యనుమతిఁ గైకొని
క్ష్మారమణుం డంతిపురిని • గల చిత్రము లెం
తే రహిఁ గాంచుచు నుండ న
పారతరాశ్చర్య మొసఁగు • పటములఁ గాంచెన్. 61

క. కనుఁగొన నయ్యవి యెల్లను
దన ప్రతిబింబంబు లగుచుఁ • దద్దయు వేడ్కన్
గనికరము గొలుపు చుంటను
గని కరమున్ విస్మయంబు • గలుగఁగ మదిలో. 62

సీ. ఇది యేమి చిత్రమొ • యె య్యెడఁ గనిన నా
ప్రతిబింబములె కానఁ•బడుచు నుండె
ఎవ్వారు వ్రాసిరో • యేమి కారణ మొక్కొ
నా చరిత్రంబె గ•న్పట్టు చుండె
నా చెంత నిలచి దీ•నత వేడు చున్నట్లు
లిఖియింపఁ బడిన యీ • లేమ యెవరో
అతులార్తిఁ జెంది భూ•పతిక యై వగచు నీ
సరసీరుహానన • చరిత మేమొ

గీ. ఇటుల ననుం జేరి వేడుట • కేమి కతము
యెవరికాంతయొ యింతయు • నెఱుకపడదు
కాంచ నవమోహనాంగిగఁ • గానఁబడును
వహ్ని నెవ్వ రీ: సుమమాల • వైచిరొక్కొ. 63

గీ. అనుచుఁ జింతించి కృష్ణరా • యాధిపుండు
గాంచె నొం డొక యెడ నిజా • కార మూని
యొక్క లేఖను జదువుచు • నున్నలీల
లిఖిత మై యున్న యొక చిత్ర • లేఖనంబు. 64

క. ఆ యుత్తరంబులోపల
వ్రాయంబడి యున్నయట్టి • పద్యంబుల భూ
నాయకుఁడు చదివె నిటులఁ గృ
పాయతమతి జాలి గొలుపు • నట్లు కరంబున్. 65

ఉ. ఈవనమధ్యభాసురద • హీనవినూతనపుష్పమంజరీ
శ్రీ విహరించు షట్పదము • చేరదు సంపఁగి రమ్యమూర్తి కా
దే! విన భృంగ మీవిహార • ణేచ్ఛ యెఱుంగదె హా! 'బలీయసీ
కేవల మీశ్వరాజ్ఞ' యని కీర్తి • వహించుటఁ జేసి కానిచో. 66

చ. అరయుదె కింశుకప్రసవమా • యిపు డీ మధుపంబు మాలతీ
విరహము మీఱ నీవిరుల • వే గని తా ననల్పభమాప్తి న
శిరమున సంచరించెడిని • జిత్ర మగున్ ప్రకటింపఁ బోకు మీ
సరణి నిమేషమాత్రము య • శంబు లభించెడి నీకు నావలన్. 67

ఉ. భృంగము! సంచరింతు గద • యీభువనాంతర మందు నెందు నై
నం గని యేని విన్న యెడ • నాకు వచింపు మసత్య మింత యే
నిం గలుగంగ రాదు ఘన • నీతివిదుండవు పక్షపాత మా
త్మం గొనఁబోకు జాజికుసు • మంబును పోలిన సూన ముండునే. 68

మ. అతిచిత్రంబుగ దివ్యపుష్పతతిఁ బ్ర•జ్ఞారూఢు లెంతే మహా
ద్భుతశక్తిన్ లిఖియింత్రుగాక భువి నా • పుష్పవ్రజం బింతయే
నతులామోదమధుద్రవం బొసఁగునే • యశ్రాంతమున్ దత్సుమ
ప్రతతిం దేనియ లానఁ జూచెదవు వి•భ్రాంతాత్మ వై భృంగమా!

క. అన్యాపదేశపద్యము
లన్యాలోచనవిరహితుఁ • డై చదువుచు నా
మాన్యయశుం డందలి సౌ
జన్యంబున కలరె తనదు • స్వాంతములోనన్ 70

ఉ. కాంత యొకర్తు దన్ను నిజ•కాంతుఁ డవజ్ఞ యొనర్చి వీడ, నా
కాంతు ననుగ్రహంబునకుఁ•గాఁ దపియించుచు నుండి యీమహీ
కాంతుఁడఁ నేన యూట దన • కౌశల మొప్పఁగ విన్నపంబు నా
చెంతకుఁ బంపఁబోలు నిటు • చిత్రపటావళి కైతవంబునన్. 71

గీ. కాని యీయింతి సుందరా•కార మరయ
గజపతీంద్రుని పుత్రిక• జ్ఞప్తి వచ్చు
నిందలి చరిత్ర మెల్ల నా • యింతి చరిత
మటుల దోచుచుండెఁ సత్య • మరయవలదె 72

వ. అని సగౌరవంబుగ నం దుండి వీడ్కొని నిజనగరాభిముఖుం డై దవ్వులం గల పరివారముం గలసికొని కతిపయ ప్రయాణంబులఁబుర ప్రవేశ మొనరించి తాఁ గాంచినయాయుదంతంబెల్లనప్పాజి కెఱింగించిన నాతండును నాపె తుషారా మై యుండనోపునని వాక్రుచ్చి మున్ను కటకపురి విడిచి రా ననుజ్ఞాతులైన వా రాపె నందె డించివచ్చుటయు నప్పుడ యెఱింగింప నాభూమండలాఖండలుండు వెండియు నాయండజయాన హృదయం బెఱుంగం గోరి తిమ్మరుసు వెంట రా నిరువురును బ్రచ్ఛన్న

వేషధారులై నగరంబు వీడి వచ్చి తుఖాసతీమణి ద్వారాంతికమున నిలచి తద్వారపాలకురాండ్రలో నొక్కర్తుకంగాంచి యిట్లనిరి.

గీ. కటకపురినుండి మీయమ్మ • గారికొక్క
కమ్మ దెచ్చితి: మిదిగో కై•కొ మ్మనంగ
నతివ యిట్లనె మాదేవి • యాజ్ఞ లేక
తీసికొనము లేఖల మేము • ధీవిచార! 74

ఆ. వె. మనవిఁ జేసి పిదపఁ • గొని పోదు మందాఁక
నిందె యుండుఁ డనుచు • నేఁగి దాసి
విన్నవింప: నాపె • కన్న వా రంపిన
కమ్మగానఁ జూడ•నమ్మకింతు. 75

క. అని దాసి తెచ్చి యిడ లే
ఖను గైకొని కుతుకమునఁ దుఃఖారమణి రయం
బున విప్పి చదివికొని మన
మునఁ గటకటఁ జెంది యిటుల • ముగుద లిఖించెన్. 76

ద్విపద 1. అవధరింపుము తల్లి • తవపాదములకు
సవినయంబున నమ•స్కారముల్ సలిపి
2. వరదరాజమ్మ నాఁ బరగెడి నేను
అరయఁ దుఖాసతి • యని రుచీదేవి
3. అని మీరుఁబిలచు మీ • యాత్మసంజాత
వినుపించు విజ్ఞప్తి విన వేడుదాన
4. జ్యోతిష్కు లాడిన • చొప్పున నేను
పూతచరిత్రుఁ డై • ఖ్యాతి వహించి
5. సర్వసర్వంసహా•చక్రంబు నేలు
సార్వభౌముని పత్ని • సత్యంబు గాఁగఁ

6. గాని మీా మదిని ని•ష్కారుణ్య మూని
పూని కావించు దు•ర్బోధ లాలించి
7. చెడుమాటలకు నాదు • చెవియొగ్గుకతన
గడుసు దాసికి లోఁగి • పడిన హేతువున
8. పాపకార్యమునకుఁ • బాల్పడ నున్న
నాపాపఫలమిట్లు • నను జుట్టుకొనియె
9. ఇది నాదు ప్రారబ్ధ • మెందు దాఁగినను
వదలునె యనుభవిం•పక తప్ప దిఁకను
10. కులహీనుఁ డంటి వీ • పలుకులు నాకు
ములుకు లై బాధించె • బలుక కెన్నడును
11. సాగి వారల వంశ•సంజాత యైన
నాగాంబ గాంచిన • నందనుం డిటులఁ
12. గులహీనుఁ డగును ని•ర్గుణు లైనవారు
పలుకు మాటల నమ్మఁ • బాడియె తల్లి!
13. ఆ కరుణామయు • నా ధీరచరితు
నాకులీనుని సుంద•రాకారయుతుని
14. హృదయసీమను నిలిప్పి • యుండె వసింతు
అదియె నాకానంద • మదె ముక్తి గాని
15. కటకటా నే రాజ • కాంత నై యెట్లు
కటకంబుఁ జేరుదు • క్షమియింపు మమ్మ
16. ఇఁక నెన్నడును లేఖ • లిటు వ్రాయ కమ్మ
ప్రకటితోదారు నా • పతి దూర కమ్మ
17. పతిపదధ్యానాభి•రతి నుంటి నమ్మ
సతికి న య్యదియె స•ద్గతి యాఁగ దమ్మ

18. జనకుపై నెన్నడు • కినియఁ బో కమ్మ
మనమున నను నింక • మఱువుమో యమ్మ. 77

ఆ. వె. అని లిఖించి వారి • నన్నపానములచేఁ
దృప్తి పఱచి కమ్మ • యిచ్చి పంపె
నంతఁ గృష్ణరాయఁ • డప్పాజి పురి వీడి
చదివికొనిరి లేఖ • ముదము గదుర. 78

మ. అనియెన్ దిమ్మరుసయ్య కాంచితివి గా•దా! యా మహా•సాధ్వి చే
సిన దోషంబు రవంత యేనిఁ గలదే • చేటీదురాలోచనం
బునఁ బ్రాప్తించిన నీ మహా•వ్యథకు రే•పుల్ మాపు దుఃఖార్త వై
జననథాగ్రణీ! కొల్చుచుండె నిను బ•శ్చాత్తప్తచిత్తంబునన్. 79

క. కావున వైళంబ తుఖా
దేవిని సత్కరుణ మీఱ • దేవా! యిఁక మీ
దేవేరిగఁ గైకొని సం
భావింపుము సుఖము లెల్లఁ • బడయుము నిచ్చల్. 80

ఆ. వె. అనుచు విగతవేషుఁ • డై విప్రవర్యుండు
విభునితోడ మగిడి • వెడలి వార్త
నంపె విజయనగర•మం దుండి తిమ్మరు
సయ్య వచ్చె దర్శ • నార్థ మనుచు. 81

క. ఆమాట విని తుఖారమ
ణీమణిహర్షాబ్ధిఁ దేలి • నిరుపమవినయ
శ్రీ మెఱయఁ దోడి తెమ్మని
కోమలి నొక్కర్తుఁ బంపె • గురువరు కడకున్. 82

చ. ఆసతి యేఁగుదెంచి విన•యంబునఁ దోడ్కొని పోయి వారలన్
భాసురసౌధసీమ నొక • బంధురకాండపటంబు వెన్క భ

వ్యాసన మిచ్చి భక్తిమెయి • హర్షము గూర్చుచు నుక్తరీతి యా
యాసము వోవ వీవనను • హస్తమునం గొని వీచు చుండఁగా. 83

ఆ. వె. తల్లి వగుదు వీవు • తనయుల చెంత న
భ్యంతరం బదేల • యనఘశీల
యనుడు రుచి వచించె • నగు నాదు తండ్రి వీ
వగుదు వనఁగఁ దిమ్మ•యాఖ్యుఁ డలరి. 84

క. యవనికను ద్రోసికొని యా
యవనీసురుఁ డరుగుదెంచి • యట నొక పీఠం
బున నధివసించి యి ట్లను
జననీ! యిఁక రాజ్యమునకుఁ • జనుదేరవలెన్. 85

సీ. ధాత్రి నెవ్వారి కైన • దైవసంఘటనచేఁ
గష్టసుఖంబులు • గలుగుచుండు
నవ్వాని మీఱి నా • యబ్జజునకు నైన
నలవిగాదన మాన•వులకు నగునె
ఆల సంచితార్థంబు • లనుభవింపఁబడంగ
మిహిరుఁ గాంచి తొలంగు • తుహిన మటులఁ
దొలఁగి పోవును సుఖ•దుఃఖముల్ మనప్రయ
త్నంబు లేకయె త మం•తటనె తాము

గీ. గాన నెప్పు డేవారి కే • కష్టసుఖము
లంద విధి నిర్ణయించెనో • యపుడు వారు
వాని ననుభవించియె తీర•వలయు వినమె
యవని 'సంచితార్థో విన•శ్యతి' యనంగ 86

సీ. పరికించెఁ గర్ణాట•వసుమతీనాథుండు
శ్రీకరం బగు భవ•చ్చిత్తవృత్తి

ఈక్షించె నీహృద • యేశుండు తావక
భర్తృపాదాబ్జసే • వావ్రతంబు
గ్రహియించె శ్రీకృష్ణ • రాయభూవిభుఁడు నీ
మాన్యపశ్చాత్తప్త • మానసంబు
క్షమియించె సత్కృపా • కరుఁడు మీవారు చే
యించిన ఘోరదు • ష్కృత్య మెల్ల
గీ. మఱియు నోసాధ్వి! భవదస • మానయశము
కలుషరహితచరిత్రంబుఁ • దలఁచి తలఁచి
సంతతానందబాష్పముల్ • జాలువార
వేచి యుండె నీ రాకకు • విభుఁడు తల్లి! 87

సీ. కమనీయచిత్రలే • ఖనమునఁ దావక
సురుచిరాకారంబుఁ • జూచి మెచ్చి
నిర్భరమోహాంబు • నిధి మున్గి బహుళప్ర
యత్నముల్ సేసి పెం • డ్లాడి మిమ్ము
దురోబ్ధితాత్మ యూ • దుష్టదాసీకృత్య
మది యని యెఱుంచుకే • మదిఁ దెలియక
మానితానందసం • ధానసమయమున
కరవాలకలిత వై • క్రాలుకతన
గీ. వంచితారాతిపుత్రి వై • వరలు నీదు
హృదయపూర్వకకృత్య మం • చెంచి తేడు
తలను దాల్పంగఁ దగు పూల • దండ నిటులఁ
గాలిచే ద్రోసె నిది దైవి • కంబు తల్లి. 88

క. అనవుండు తుఖాసతి మన
మున నశ్రాంతంబుఁ బొంగి • హొరలెడి దుఃఖం

బును నపనయించుకొని యి
ట్లనియెఁ గద్గదిక గదుర • న విప్రునితోఁ. 89

సీ. వినియెనా నామనో • విభుఁడు నే నొనరించు
నా దీనసంస్మర • ణంబు నెల్లఁ
గనియెనా నాప్రాణ • కాంతుండు నాదగు
దరిలేని యీపరి • తాపగరిమ
క్షమియించెనా కృపా • కలితుఁ డజ్ఞానపూ
ర్వక మైన నాయప • రాధసమితి
అంగీకరించెనా • యనఘుండు దుష్టాత్మ
యనుచు నెంచక మదీ • యాంగమంబు

గీ. ఆదరించున నను దన • పాదకమల
దాసిఁగా నైన నిసు మంత • దయను జూపి
మారసమమూర్తి బుధనుత • చారుకీర్తి
సత్యపథవర్తి కర్ణాట • చక్రవర్తి. 90

సీ. పాపాత్మురాల నా • పాపఫలం బెల్ల
నాజన్మ మిట నుండి • యనుభవింతు
పరమపావనుఁ డైన • పతిపదాంభోరుహ
ధ్యానైకచిత్త నై • తనరు చుందు
భర్తృసాన్నిధ్యంబుఁ • బాసినఁ బతిరాజ్య
మందె యుంటకు మది • నలరు చుందు
క్షమియించెఁ బతి యను • చల్లని పల్కులు
వినఁ గల్గుటకు మది • వేడ్కఁ గొందు

గీ. అంతియే గాని భోగభా • గ్యముల ప్రాప్తి
యెప్పుడో తీరిపోవంగ • నిపుడు మగిడి

వదలి వచ్చిన పురికి నే • వచ్చు టేల?
వచ్చి పూర్వగాథను జ్ఞప్తి • దెచ్చు టేల? 91

గీ. కరుణ గల దేవి మన్మనో•హరుని నొక్క
సారి దర్శన మీయ నం•జలి ఘటించి
వేడుకొను చుంటి నని విన్న•వింపుఁ డనుచు
బాష్పలోచన యై తల • వాల్చి యుండె. 92

క. యవనిక మఱుఁగునఁ గల భూ
ధవుఁ డంత స్వకీయరూప•ధరుఁ డయి రా, నా
యవనిసురుఁ డరిగె నరుగుట
నవనతముఖి యాటఁ గనక • యా రుచి మగుడన్. 93

సీ. సదయాత్మ న న్నొక•సారి యా దివ్యమం
గళవిగ్రహంబును • గాంచ నిండు
వరయశుం డైన యా • భవ్యచరిత్రుని
పాదపద్మములపై వ్రాల నిండు
అతులితభక్తి మ•త్పతిపదయుగళి నా
కన్నీటిధారలఁ • గడుగ నిండు
అజ్ఞానసంజని•తాపరాధము క్షమి
యింపుఁ డంచును విన్న•వింపనిండు

గీ. అదియె నాజన్మసార్థక • మదియె నేను
గోరు చున్నట్టి కడసారి • కోర్కె యనుఁడు
ఇవియె హృదయపూర్వకనమ•స్కృతు లటంచు
నాథునకుఁ దెల్పుఁ డనఘ పు•ణ్యంబు గలుగు. 94

వ. అని మొదలు దెగినకదళివలె మేదినిం బడి యున్న సుదతి నాభూపురంద
రుం డానందకందళితహృదయారవిందుం డయి సాదరంబున గౌఁగిటం

బోదవి సంతతగళితాశ్రుబిందుసందోహంబును దవగోటం జిమ్ముచు
గద్గదికంబు గదురమందమందమృదూక్తి నాసుందరాంగికిట్లు లనియె

సీ. దాసికృత్య మటంచు • దలపోయఁగా లేక
యువతి ని న్విడనాడు, టొక్క తప్పు
కరవాల మేల నీ • కడ నుండె నని యైన
నొకప్రశ్న మడుగని • దొక్క తప్పు
అంతమాత్రమున నే • మాయెనంచుఁ దలంచి
యోర్పు వహింపని • దొక్క తప్పు
ఇంత కాలము నీయు • దంతంబు నరయక
యూరక యుండిన • దొక్క తప్పు
గీ॥ అతివ తప్పు లన్నియును నా • యందె కలవు
ఏన వేడుకొందును క్షమి • యింపు మనుచు
బాల! యీలీల దుఃఖింతు • వేల చాల
నేలుకొనుమ న న్నింక న • ర్థేందుఫాల! 96

చ. అనుచు నిజాశ్రుబిందువుల • నంగుళిఁ జిమ్ముచుఁ దన్ను గౌఁగిటం
దనుపుచు నున్న నాథు వద • నంబును గాంచి ససంభ్రమంబునన్
వనిత యొకింత స్వప్న మను • భ్రాంతియు గద్గదికంబుఁ జెంది నో
టను నొకమాట రామి వస • టన్ గొని బాలికవోలె నేడ్చుచున్. 97

సీ. మేదురాదరమతి • నాదు నేరము లెల్ల
క్షమియించినాఁడవె • సాగ్వభాను
నయకోవిదుఁడ వయి • నాపాపభరమును
దొలఁగించినాఁడవె • కులకలాప!
దీనావనుఁడ వై మ • దీయ ప్రార్థనముల
నాలించి వచ్చితే • యమలశీల
సంతాప మడగింప • సత్కృపాన్వితుఁడ వై
దర్శనం బొసగితే • ధర్మనిచయ!
• ధన్యమతి నైతి నింక నో • మాన్యచరిత!
పండె నేఁటికి నాదగు • వ్రతము లనుచు

సంతతానందబాష్పవర్షంబు గురియ
నటులె పడియుండె నాథు కౌఁగిటను మఱియున్. 98

క. అండజయానయు నృపమా
ర్తాండుండు నఖండకౌతుకాన్వితమతు లై
యుండి రొకకొంతకాల మ
ఖండల వైభవముతోడఁ • గంబాఖ్యపురిన్. 99

క. పిదప నొక శుభదినంబున
విదితయశుఁడు కృష్ణరాయవిభుఁడు తుఖారామ్
సుదతీయుతు డై వెడలెను
ముద మొదవఁగ స్వీయరాజ్యమునకున్ వేగన్. 10

చ॥ చని నిజబాంధవాప్తజనసంతతి సంతసిలంగ సంతతం
బును గవితాప్రసంగములఁ • బ్రొద్దులు పుచ్చుచు నాంధ్రభోజుఁ డై
తనరి యనేకవర్షములు • ధారుణి నేలె మహీపురందరుం
డనఁ దగి కృష్ణరాయమనుజాధిపుఁ డిద్ధయశోవిశోవిశాలు డై. 10

మాలిని. వరనియమవిలోలా • భవ్యసత్కీర్తిజాలా
నిరతసుకవిపాలా • నిర్మలానూనశీలా
పరమగుణ విలాసీ • భద్రగుంటూరువాసీ
సురుచిరసుచరిత్రీ • సూరయాభిఖ్యపుత్రీ. 1

ఇది

గద్య:— శ్రీవిరాడ్విశ్వకర్మ వంశసంజాత, శ్రీరామన్వయదుగ్ధపయోధి
సుధాకరాంగిరసగోత్రపవిత్ర, గంగయాచార్యపుత్ర,
సుబ్బమాంబాగర్భ శుక్తిముక్తాఫల, శ్రీశ్యామలాంబ
పాదారవిందమకరందాస్వాద సానందహృదయేం
దిందిర, వీరబ్రహ్మహ్వాయ ప్రణీతం
బైన 'తుఖారామ్' నామక
ప్రబంధము నందలి
తృతీయాశ్వాసము.
సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టి.

| పుట, | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| ముఖపత్రము | | 2 | Dedicated to | By the encouragement of |
| అంతర్ముఖపత్రము | | 18 | యంకితమున | ప్రోత్సాహమున |
| రెండవ చిత్రపటము | | 1 | కృతిభర్త | ప్రేరేపణకర్త |
| విజ్ఞప్తి | ... | 7 | టయుం | టయు |
| ,, 2 | | 4 | పౌత్రి | దౌహిత్రి |
| ,, ,, | ... | 8 | వృధ్ధి | వృద్ధి |
| 6 | 11 | 3 | రేకవిడె | ఁగాకవిడె |
| ,, | 13 | 9 | ఖుడయి | ఖుండయి |
| | | 10 | యాగ్ధి | యాబ్ధి |
| 7 | 15 | 1 | భావిర్భవ | ఖావిర్భవ |
| ,, | ,, | 11 | ననుజూఁడ | ననుజూఁడను |
| 10 | 24 | 5 | కార్యకార్య | కార్యకార్య |
| 11 | 25 | 4 | రేడు | ఱేఁడు |
| 11 | 28 | 1 | అతని | ఆతని |
| | 29 | 1 | ద్యజించి | ద్యజియించి |
| | | 5 | కొందరు | కొందఱు |
| 12 | 34 | 2 | సాధ్యాబు | సాధ్యంబు |
| | | 4 | పడిసిన | పడసిన |
| 14 | 44 | 3 | మగుల | మిగుల |
| 15 | 45 | 4 | కాత్మజు | జాత్మజు |
| 15 | 47 | 7 | శ్చంద్రా.రా | శ్చంద్రరా. |
| 16 | 49 | 4 | మెచ్చఁశిష్ట | మెచ్చశిష్ట |
| ,, | ,, | ,, | పాలముం | పాలనముం |
| 17 | 54 | 4 | తాఁరా | లారా |
| 18 | 60 | 1 | స్వీశ | స్వీయ |
| 20 | 66 | 8 | సద్దంసి | స.ద్వాంసి |
| 20 | 67 | 1 | బాత్రియాంసతతము | బుత్రిపుత్రియుఁగడుఁ |
| | | 4 | స.తాగ్ర | స. తాగ్ర |
| 21 | 68 | 9 | సహజకుణ | సహజసుగుణ |
| ,, | 70 | 2 | బాత్రికినీ | దత్పుతపుఁ |
| 15 | 67 | 4 | పురం | పుర |
| 18 | 81 | 2 | దాహావ | ఁడాహావ |
| 36 | 160 | 1 | రముఁగ | రంబుగ |
| 42 | 28 | 3 | జా | డెఁ |
| 64 | 132 | 3 | బొలిన | బోలిన |
| 74 | 22 | 1 | నిలువ | నిలువం |
| 86 | 63 | 1 | ననుం | నను |
| 95 | 96 | 12 | పాల | ఫాల |
| 96 | 98 | 12 | మటియుఁ | మఱియు |
| 96 | 101 | 4 | యఃశోవిశోవి | యఃశోవి |

## ఏతద్గ్రంథకర్తచే రచింపఁబడి ప్రకటింపఁబడిన గ్రంథవివరము.

1 నానారాజన్య చరిత్రము. శ్రీ వెంకటగిరి మహారాజుగారిచే రూ 500 లును, శ్రీరాజా భుజంగరావు బహద్దరుగారిచే నొక సువర్ణ పతకమును బహుమతి వడసినది. శ్రీయుత చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణ ప్రసాద్, బి.ఏ. గారిచే (డిప్టీ కలెక్టరు-గుంటూరు) వ్రాయఁబడిన పీఠిక గలదు. చిత్రపట శోభితము. 300 పేజీలు, కాలికో బైండు. 3—0--0

2 పల్లవరాజ చరిత్రము. 1—0—0

3 తుఖారామ్ (గజపతిరాజపుత్రిని కృష్ణరాయలు పెండ్లాడిన విధానము దెలుపు పద్యకావ్యము) 1—0—0

4 చంద్రకాంత. (ఆఱంకముల నాటకము. నాల్గవ కూర్పు) 1—0—0

5 జపానీయము. (రష్యా జపాన్ యుద్ధము. అయిదంకముల నాటకము) 0—12—0

6 వాసంతిక. (స్కాటునవలనుండి యనువాదింపఁబడిన యైదంకముల నాటకము. ఇంటర్మీడియేటుకు 1923-24 లలోఁ బఠనీయ గ్రంథము. రెండవకూర్పు). 1—4—0

7 వినోదిని. (A Social Drama in 6 Acts) 1—0—0

8 ప్రియదర్శిక. (మనోహరమైన నవల). 0—12—0

9 మార్కండేయ విలాసము. (హరికథ). 0—12—0

10 పాదుకా పట్టాభిషేకము. (హరికథ) 0—12—0

11 శిల్పశాస్త్రము. 0—4—0

12 శ్రీ విరాట్ప్రభు శతకము. 0—4—0

13 హాస్యరసమంజరి. 0—2—6